


### సాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక సాలుచందా రు. 4-8-0. అర్థసంవత్సరపు చందా రు. 2-8-0. అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతిలేదు. విడికాపి ఆరు అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వాని విలువమేరకు తపాలా బిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

### ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీల కందీయవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుట కీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలువుటకు తక్కువయైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొఱకు వ్రాయునది.

### వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమై యుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్రప్రచురణకు వీలగును. ఒకేప్రక్కసిరాతో స్పష్టముగ తప్పులులేక వ్రాయవలెను. భాష గ్రాంధికముగాని, వ్యావహారికముగాని కావచ్చును; రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వ హక్కులు గలవు. ప్రకటింప నంగీకరింప బడినపుడు మాత్రము రచయితలకట్లు తెలుపబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను. రిప్లైకార్డు వ్రాసిననే బదులివ్వబడును.

### సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

### చిరునామా మార్పు

చిరునామాయందు మార్పున్నచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

### ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్పుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అనుచిరునామాకే వ్రాయవలయును. చెక్కులు, మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం లిమిటెడ్' పేర పంపవలెను.

చెక్కులు మద్రాసు బ్యాంకులపైననే పంపవలెను.

వ్యవస్థాపకులు
డాక్టరు కే. యన్. కేసరి

# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్యసౌభాగ్యములను పెంపొందించుట
కేర్పడిన సచిత్ర మాస పత్రిక

ఆక్టింగ్ ఎడిటర్

సి. సి. పున్నయ్య

సంపుటము ౨౭] ఏప్రిల్ 1956 [సంచిక ౮

# విషయసూచిక




స్త్రీలు-ఆత్మహత్యలు 169

ఈశావాస్యోపనిషదు : శ్రీ చిన్మయానందస్వామి 171

ఉగాదికానుక : కల్లూరి అహోబలరావుగారు 174

అంతర్యాలు : కే. పార్వతిగారు 176

ఆకలిరాళ్లు : యన్. యన్. రావుగారు 177

శ్రీరామకర్ణామృతము : కల్లూరి అహోబలరావుగారు 184

కొండవీటికోనలు : చిల్లా వెంకటకృష్ణమూర్తిగారు 187

భక్తియే ముక్తి నొసగును : ఎచ్. కనలక్ష్మమ్మగారు 189

కాలిబాట : 'ప్రవాహి' 192

బాలవినోదం : 195

తెల్లరోజా : డాక్టర్ వి. యస్. శర్మగారు 198

స్మృతిపథం : కావుటూరి వేంకటనారాయణరావుగారు 200

తనలోతాను : 'విజయ - రాఘవ' 201

ఐదునిముషాలు : వి. యస్. రామమూర్తిగారు 206

అశ్రుతర్పణం : 'పద్మ - నరేన్' 212

ఆంధ్ర జానపదగేయ వాఙ్మయ చరిత్ర : ఏకుమళ్ల కామేశ్వరరావుగారు 218

స్వీకారం 222

సంపాదకీయములు 223

పంచాంగము 224






పాండిచేరి నగరమందలి దీపగృహము, కస్టమ్సుహౌస్





పాండిచేరి యందలి ఫ్రెంచి గవర్నర్ డూప్లే విగ్ర



పాండిచేరియందలి ప్రపంచ యుద్ధ స్మృతి చిహ్నము



*Photos by* : Mr. S. T. Arasu



వ్యధిత హృదయ




జయజయ గృహలక్ష్మి సఖీ! జయజయ లలితాంధ్ర! మధుర సారస్వతమా!
జయజయ లలనా రత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయకల్యాణీ!



# స్త్రీలు — ఆత్మహత్యలు

జీవయాత్రలో స్త్రీలు, పురుషులు సమాన భాగస్వాములు. ఉభయుల శ్రేయస్సు, సౌభాగ్యములు కుటుంబ జీవితాన్ని ఆనందమయంచేయును.

వైవాహిక జీవితంలో భార్యా భర్తలలో ఎవరి కష్ట, దుఃఖాలకు ఎవరు బాధ్యులైనా కుటుంబ జీవితంలో సుఖశాంతులుండవు.

భర్త దుర్మార్గుడయ్యో, లేక నీతినియమాలు తప్పినవాడయ్యో వ్యవహరిస్తూ భార్యను నానాబాధలకు గురిచేయడం అన్యాయం. భార్య సుఖాన్ని లక్ష్యంచెయ్యకుండా బాధ్యతా రహితంగా వ్యవహరించే భర్త శిక్షార్హుడగు వ్యక్తి. దాని ఫలితంగా తాము యమయాతనలుపడలేక ఆత్మహత్యలుతప్ప గత్యంతరము కనుపించని ఘటనలు చాల విచారకరమైనవి.

తను ఉద్యోగ సద్యోగాలుచేసి సంపాదించేవాడైనా ఆహారపానీయాల అమర్చడంతోబాటు సర్వవిధాల కుటుంబ నిర్వహణలో తోడ్పడుతూ సమాన బాధ్యతల

నిర్వహిస్తున్న భార్యను నిర్లక్ష్యంచేయడంకాని, ఏవగించుకోడంగాని, హింసించడం కాని, నీతినియమాలుతప్పి బాధ్యతా రహితంగా వ్యవహరించడముకాని అమానుషమే కాగలదు.

భర్త తన విద్యా విజ్ఞాన అనుభవాలను పురస్కరించుకొని కుటుంబజీవితంలో భార్యను తన్ను అనుసరింపజేసికుంటూ కష్ట సుఖాలలో సమాన భాగస్వాములై మెల గడం శ్రేయస్సౌభాగ్యాలకు మార్గం.

స్వార్థపరులై నిరంకుశులుగానుండి స్త్రీలు ఆత్మహత్యచేసికొనుటకంటె గత్యంత రములేనట్లుగా వ్యవహరించిన పురుషులకు ప్రభుత్వము, సంఘముకూడ బుద్ధిచెప్పి సన్మార్గంలోకి త్రిప్పవలసియున్నది.

ఏదైనా స్త్రీలు పురుషులు సౌభాగ్యవంతమైన కుటుంబజీవితాన్ని గౌరవించి తమ బాధ్యతలను, హక్కులను, అవకాశములను విశాల దృష్టితో అర్థముచేసికొని వ్యవహరించినపుడు స్త్రీలు ఆత్మ హత్యలకు పూనుకోవలసియుండదు ; పురుషులు మనశ్శాంతిములేక క్రుంగి క్రుశించిపోవలసియుండదు.



రాసలీల నృత్యము చేయుచున్న మణిపురి బాలికలు. మణిపురిలో బాలబాలికలకు మణిపురి నృత్యమును గరప్రత్ నూతనంగా ఒక కళాశాల స్థాపించబడినది.

# ఈశావాస్యోపనిషదు

పూజ్యపాద శ్రీ స్వామీ చిన్మయానందజీ.

## ఉపనిషదులు

(గతసంచిక తరువాయి)

ఇట్టి భావము, అపూర్వమును, సూక్ష్మతరముగ నుండుటవల్ల, శిష్యులు చక్కగ బోధ పొందియుండరను నమ్మకముతో రాబోవు శ్లోకమును కూడ ఈ భావమును తెలుపు సత్య విషయమునే మరియు వివరించుచున్నారు.

యస్మిన్సర్వాణి భూతాన్యాత్మైవా
భూద్విజానతః
తత్ర కో మోహః కః శోక ఏకత్వమను
పశ్యతః ॥ ౭ ॥

తెలుసుకొనువాడు సర్వ జీవితములును తన ఆత్మయందు ఏకత్వమును కనుగొనుచుండగా, అటు పిమ్మట అతడు ఎట్లు భ్రమకు పాత్రుడు కాగలడు? సర్వత్ర ఏకత్వమును గాంచు నతనికి ఎట్టి దుఃఖము సంప్రాప్తము కాగలదు?

ముందటి శ్లోకమున ఆత్మ సాక్షాత్కార వైభవమును, అభావ గుణములతో వర్ణించెను గాని స్వభావ గుణములతో వర్ణించలేదు. అట్టి వ్యక్తి దేనిని చూచి అనురాయముగాని, ద్వేషమునుగాని అటుపిమ్మట జీవితమున పొందడు అని తెలుపబడి యున్నది. కాని ఈ శ్లోకమున, ఆభావమును నొక్కివక్కాణించుచు, సాధన వల్ల సాధ్యమని ఋషి మనకు విమర్శించుచున్నాడు.

ఆత్మ సాక్షాత్కారము పొందిన మానవుడు తీక్ష్ణ అనుభవము లేక ఇతర జీవరాసుల వ్యతిరిక్తముగాని, వేరుగాగాని, తన స్వరూపము లేదని తెలుసుకొనుటయే గాక, తన శుద్ధ స్వభావ నిర్మాణమున, సర్వద్వంద్వముల, సర్వ వికారములలోన అంతర్భూతమై వెలయు శాంతము, సమత్వమే తన స్వరూపమని దృఢముగా తెలుసుకొనుచున్నాడు. బాహ్యమునకనపడు వికారములన్నియు సత్య స్వరూపునికి పాచి కప్పు వంటిది. పరిపూర్ణముతో తన వ్యక్తిత్వముయొక్క ఐక్యమును కనుగొనిన పురుషుడు, తన మనసునందు మోహము శోకమువల్ల కలుగు సామాన్య ఉద్రేక అలజడలు కలుగజాలవు.

భ్రమనే శోకముగా ప్రకటితమగుచున్నది. ఒక మనిషికి భ్రమ ఎంత తీవ్రముగ నుండునో, అతని శోకము అంత తీవ్రముగా నుండును. అతని నిజ స్వభావమున అతడు పరిపూర్ణ ఆనంద స్వభావుడు. ఏకత్వము, లేక సమత్వమే ఆనందము. కాని భ్రమ వల్ల, అతడు ద్వంద్వమును, అసమత్వమును కనుగొనుచున్నాడు. అందువల్ల అతని యందు శోకానుభవము కలుగుచున్నది. ఈ భ్రమయే శోకమును కలిగించును, భ్రమ అధికమగుకొద్ది, శోకముకూడ అధికమగుచుండును.

మానవునికిగాని, మృగమునకుగాని, ప్రతి జీవించు వ్యక్తికిని, శోకమునుండి దూరము కావలెనను సంకల్పమే జీవిత ఆశయముగానున్నది. మోక్షము, లేక విముక్తి అనునది, వ్యక్తిగత దుఃఖ ఆవరణమును దాటిపోవుట. ఈ శ్లోకమున, ఆత్మ సాక్షాత్కార సామ్రాజ్యము, దుఃఖము, రోదనముల ఆవరణకు అవతలయున్నదనియు, అచ్చట, ద్రష్ట, తన ఆత్మానుభవమున సర్వ బ్రహ్మాండమంతయు ఏకమని అనుభవించుచుండును.

ఘటాకాశము, మహాకాశమునకన్న తాను భిన్నము కాదని తెలుసుకొనిన తర్వాతనే, తనకుగల, పరిమితి, అపరిపూర్ణత. దుఃఖములను తొలగించుకొనగలడు. ప్రతి అలయును, తాను ఇతరములకన్న ప్రత్యేకమని తలచినపుడే దానికి, జననము, వృద్ధి, క్షయము, నాశము కలిగియుండును. కాని, అది తన నిజస్వరూపము సముద్రమని తెలుసుకొనిన వెంటనే, దాని

దుఃఖము లన్నియు ముగియుచున్నవి. తాను ఇతరముల కన్న ప్రత్యేకము అను భ్రమ అటుపిమ్మట అది పొందుటలేదు. భ్రమలేనిచోట దుఃఖముండదు. భ్రమయొక్క బాహ్య ప్రదర్శనమే దుఃఖము.

ఇట్లు ఆత్మ సాక్షాత్కారము పొందిన ఋషి, తన యొక్క ఆత్మయే ప్రతి నామ రూపములయందు ప్రకాశించుచున్నదనియు, ప్రతి దేశ కాల అవరమునందును, సుఖమో దుఃఖమో, భేదములేక, వివిధ వికార అల్లరి జీవితమునందును శాశ్వతమున్నత శాంత సమ్మేళణ సూత్రము అంతర్భూతమై యుండుట స్పష్టముగా చూచుచున్నాడు. అతనికే గొప్పశక్తి, పరిపూర్ణ ఆనందము, విశాల విజయ జీవితము సాధ్యము. ఘోర దుఃఖముకూడ అతనిని తృణ పర్యంతముకూడ చలించ జాలదు. గీతలో "యస్మిన్ స్థితో న దుఃఖేన గురుణాపి విచాల్యతే." "అచ్చట స్థాపితుడై, అతడు ఎట్టి గొప్ప దుఃఖమువల్లను చలింపబడుటలేదు."

స పర్యగాచ్ఛుక్రమకాయమవ్రణ
మస్నావిరం శుద్ధమ పాపవిద్ధమ్।
కవిర్మనీషీ పరిభూః స్వయంభూర్యా
థాతథ్యతోఽర్థాన్ వ్యదధా
చ్ఛాశ్వతీభ్యః సమాభ్యః ॥ ౮ ॥

ఆ ఆత్మ, సర్వవ్యాపి, ప్రకాశవంతుడు, అశరీరుడు, గాయములులేనివాడు, ఖండరములు లేనివాడు, నిపరిశుద్ధుడు, దోషములు లేనివాడు, జ్ఞానవంతుడు, సర్వాంతర్యామి, అనుభవప్రదుడు, స్వయంభూః, శాశ్వత సృష్టికర్తలనంతయు అతడే నియమించి యున్నాడు.

ఈ శ్లోకమునందు ఉపనిషద్ భాషాశైలి ఉత్తమ స్థాయి పొందియున్నది. ఆత్మ, లేక జీవశక్తియొక్క పరిపూర్ణ నిశ్శేష వర్ణనము చేయ ప్రయత్నము కనబడుచున్నది. పాఠకులకు, శాశ్వతస్వరూపుని, భాషతో చిత్రించలేక పోయినను, శ్రద్ధగల సాధకుడు భావనా శక్తివల్ల అనుభవించగ పూర్ణావరణ భావమును తెలుపబడుచున్నది. భాష్యకార శిరోమణియను శ్రీ శంకరులు, తన భాష్యములయందు, ఆత్మను తెలుపుటకై ఈ శ్లోకమును అనేక పర్యాయములు వాడియున్నారు.

సంస్కృత భాషయందు ఇతర భాషలయందువలెగాక, విశేషణములు ఉపయోగించినప్పుడు, గుణవర్ణనముల యందలి వరుసక్రమమునందే గొప్ప ప్రాముఖ్యత నిర్మింపబడుచుండును. ఈ విధానముననే ఈ శ్లోకమునందు ఋషి ఉపయోగించి యున్నాడు.

ప్రత్యగాత్ అను పదమునకు, దూరము వెళ్లెను. లేక ప్రదక్షిణము వెళ్లెను అని అర్థము. ఆత్మ దూరము వెళ్లి, సర్వత్రవ్యాప్తము పొందెను. అనగా, ఆత్మ సర్వవ్యాపి అని అర్థము. పిమ్మట, ప్రకాశవంతుడు అని తెలుపబడెను. అనగా ఆత్మజ్ఞానజ్యోతి ప్రకాశమే మనలో జ్ఞానముగా నెలకొనియున్నది.

అకాయం—శరీరము లేనిది. శుద్ధ ఆత్మ అశరీరుడు అని తెలుపబడుచున్నది. అనగా అతనికిని, శరీర కోశములకు ఎట్టి సంబంధము లేదని భావము. అనగా పంచ కోశాతీతుడు అని భావము.

అవ్రణం — అస్నావిరం. అని చెప్పుటలో ఆత్మకు స్థూల శరీరము లేదని స్పష్టముగా తెలియుచున్నది. శరీరమున్న వ్రణములు ఏర్పడును. శరీరము లేకున్న వ్యాధులుకూడ సంభవింపజాలవు. ఈ భావమునే, అస్నావిరం. కండరములు లేవు అని తెలుపుటలో దృఢముగా తెలియుచున్నది.

శుద్ధం అనుటలో ఆత్మకు కారణ శరీరము లేదని తెలియుచున్నది. ఎందుకన అతనిని పాపములు అంటజాలవు. అన్నిటికన్న ఘోరపాపము ఏదనిన, మన నిజస్వరూపము మనము తెలుసుకొనకుండుట. ఇందువల్ల మనలో మృగమోహములు జన్మించి, మరిమరి అమానుష, మృగ కృత్యములకులోనగుచున్నాము.

ఋషులు ఆత్మ విషయము ఇదివరకు అభావశబ్దమున, ఇది కాదు, ఇది కాదు అని తెలుపుచు వచ్చిరి, భూత దృశ్యమువల్ల భ్రమకులోనైన మనుష్యునికి. స్థాణువు — కూసము — విషయము తెలుపుటకు రెండు

విధాయకములున్నవి. అతనికి, భూతము అనునది అసత్యము, భ్రమ అని తెలుపవచ్చును; లేక, స్థాణువు యొక్క నిజస్వరూపమును తెలుసుకొనుటకు సహాయము చేయవచ్చును. భ్రమ చెందిన శుక స్నేహితుని విషయములో, అభావ శబ్దముతో మొదలు పెట్టవచ్చును. అటులనే ఇచ్చట ముముక్షు, అభావశబ్దముతో మనకు తెలియజేయ నారంభించుచున్నాడు. మనకు ఆత్మపరము కాగల భావలోపము లన్నియు తొలగించుచున్నాడు. సరియైన శిక్షణయు, మార్గదర్శము లేకపోయిన, ఈ దేహము లేక ఈ బుద్ధియే ఆత్మయని తలచుట సంభవము. ఈ శ్లోకమునందలి భావముల చేరికలోనే, ఆత్మ ఈ స్థూల శరీరముగాని, సూక్ష్మ శరీరముగాని కారణ శరీరముగాని కాదని సాధకులకు తెలుపుచున్నది. వీటికన్నిటికి అతీతముగా ఆత్మ శాశ్వత, పరిపూర్ణస్వరూపముతోనున్నది.

కాని, సాధకునికి, ఈస్థూల, సూక్ష్మ, కారణ శరీరములకన్న ఏవియుండునది తెలియదు. కనుక ఈ ఆత్మ అనునదిబట్టి శూన్యము. అభావముతో కూడినదే కాని దీనికి, స్వభావములు ఏమియునిలేవు అని ఎంచవచ్చును. ఇట్లు శరీరత్రయములను తొలగించగా, ఆత్మ శూన్య స్వరూపముగ నుండవచ్చును అను పొరపాటును తొలగించుటకును, ఆత్మ స్వభావగుణములుగల దివ్య శక్తి సంపన్నుడు అని నమ్మకము కలుగుటకై, ఆత్మ యొక్క గుణములను వరుసగా తెలుపబడుచున్నది.

ఆత్మ చూచువాడు, చూచు కండ్లకు, విను చెవులకు వాసనచూచు ముక్కుకు, రుచిచూచు నాలుకకు, స్పర్శించు చర్మమునకు, మరుగున నుండి, వీటివల్ల ఇట్టి కార్యములు చేయించునది, మనయొక్క జీవశక్తి యొక్క ప్రభావము అని సిద్ధాంతములు కలవు. కార్యరూపముగా, ఈ జీవాంశమును జ్ఞానేంద్రియముల నుండి తొలగించిన, వాటికి అవి ఏ అనుభవమును పొందలేకున్నవి. ప్రపంచ విషయములను అనుభవించుటకు, మన జ్ఞానేంద్రియము అవశ్యముగ నుండవలసినదే గాక, ఆత్మయొక్క కటాక్షముచేత ఈ జ్ఞానేంద్రియములు వ్యవహరింపగల శక్తియుకలిగి యుండవలెను. ఇట్లు, ఈ జ్ఞానేంద్రియముల అన్నిటిలోను, మనసున, బుద్ధియందు, ఈ ఆత్మయే చూచువాడు. (అనుభవించువాడు). అనుభవ కార్యములు ఏవికాని, అనుభవములుకాని, ఆలోచించుటకాని, ఈ జీవకళయొక్క, స్ఫూర్తిలేనిది, కలుగజాలవు.

సర్వాంతర్యామి— ఇట్లు ఒక వ్యక్తియందు తెలుసుకొనువాడు ఆత్మగాయుండుటవల్ల, ఆ ఆత్మయే ప్రతి జీవియందును జీవ శక్తి స్వరూపముగానుండుటవల్ల ఆత్మయే అన్ని జీవులయందును తెలుసుకొనువాడుగానున్నాడు. ఇందువల్ల ఆత్మ సర్వాంతర్యామి యనియు, సర్వము తెలుసుకొనువాడనియు తెలుపబడుచున్నది. ఈ ప్రపంచమున. ఎట్టి స్వల్పజ్ఞానకమైనను, ఎట్టి వ్యవహారమయినను, ఆ ఒక్క ఆత్మవల్లనే తెలియబడుచున్నది. కనుక, మనలోను ఆత్మయే, అన్ని హృదయముల యందును, శాశ్వత జ్ఞాన స్వరూపుడై, తెలుసుకొనుచున్నాడు.

ఈ ఆత్మ, అనుభవ ప్రదుడు. ఆత్మస్థితి అనగా ఈ పరిమితులకు ఆవరణకు అతీతమైన అనుభవ శక్తివలన తెలుసుకొనదగినది.

(సశేషము)



# ఉగాది కానుక

(శ్రీ దుర్ముఖి)

(కవి శ్రీ కల్లూరి అహోబలరావు)

౧

శ్రీ పాదపమ్ములు, చివురు జొంపంబుల – మెత్తనిగద్దె, సమీకరించె
వాయుదేవుఁడు నీకుఁ బరిమళోపేతమౌ - గంధసంహతి నొడిఁగట్టినిలిచె
కోయిల పులుఁగులు 'కుహూ కుహూ' ధ్వనులచే – శ్రావ్యంబుగాఁబాడ సరసఁజేరె
భవ్యవసంతుండు వన్యఫలాదుల – హెచ్చుకూర్మిని నీకు నీయనెంచె
తడవుసేయకు మర్ఘ్యపాద్యము లొసంగ – రక్తిమెయి వేచియున్నది ప్రకృతిమాత
రమ్మ! దుర్ముఖీ! సంప్రీతి రాగదమ్మ! – స్వాగతం బందుకొనుమ! స్వచ్ఛందసగణి

౨

ఇంటింట, నీకుఁ దలంటుసేయంగ, వాల్గంటులు ప్రేమతో కాచినారు
ఇంటింటఁ గలకంఠులెల్ల, సింగారముల్ - ప్రీతి నీకొనరింప వేచినారు
ఇంటింట, నీకుఁ జేగంటలతోడ, నాహ్వానంబు లారతుల్ పట్టినారు
ఇంటింట, నీకుఁ బేరంటంబులిడుటకై - పిండివంటలు వండిపెట్టినారు
రమ్మ! రారమ్మ! నవవత్సరంపు శుభము లిమ్మతోఁ దెల్పవమ్మ! పుణ్యమ్ములబ్బ;
దుర్ముఖీ! సఖీ! సుఖముల దోఁపఁజేసి – ప్రజల నానందపఱుపు మీ వత్సరమున.

3

కోయిల, నలుపైన 'కుహూ కుహూ' స్వరముల - మధురిమ మాయమై మాసిపోన?
అల, గులాబుల పొదయందు, ముండ్లుండినఁ – గుసుమ సువాసన కుందఁగలదె?
గడుసైన, చిప్పమూకుడు కాయపైనున్నఁ - గొబ్బరతీపికిఁ గొదువకలదె?
దీపంబు చిన్నదై దీప్తితగ్గిననేమి? – వేడిమి సెగలను విడువఁగలదె?
తెల్లలవణంబు చక్కెరతీపిఁగలదె? - నల్లనయ్యకు లోపంబు చెల్లఁగలదె!
'దుర్ముఖీ' నామ ముండిన దోసమేమి? – శ్రీ ముఖముతోడ మా యిల్లు సేరుమమ్మ.

౪

రాజుగా గురువుంట, రాజ్యసుభిక్షమై - నీతియు, ధర్మంబు నెగడుచుండు
శుక్రుండు మంత్రియై, శుభవర్షములనియ్య - పాడిపంటల పెంపు బరగుచుండు
సస్యాధిపతియౌచు, చంద్రుండు వెలయంగ - మెట్టభూములు గూర్చు మేటిపంట
రసవస్తువుల, బుధగ్రహము చూచుటచేత - వానిమూల్యము, కొంతవఱకుబెరుగు
గోపబాలుండు, పశుపాలకుండుగాన - గోగణము, వృద్ధియై పాడికొఱఁతఁదీరు,
ఆయురారోగ్య భాగ్యంబు లతిశయింపఁ – బ్రజలు సుఖయింత్రు, దుర్ముఖి వత్సరమున,



అంబర్ చర్ఖాతో నూలు వడుకుతున్న మహిళ.

ఈ చర్ఖాపై నూలు వడుకుటకు ప్రత్యేకమైన సామర్థ్యము అవసరము లేదు. దీనికి నాలుగు కదుళ్లుంటాయి. 8 గంటలలో సగటున 20 వ నెంబరు నూలు 16 చిలపలు తీయవచ్చును. 1949 లో కనిపెట్టబడిన యీ చర్ఖా యొక్క ముఖ్య భాగములు లోహముతోను, కొన్ని రబ్బరుతోను తయారు చేయబడి యుంటాయి. కొయ్యతో నూరు రూపాయలు ఖరీదు చేసే అంబర్ చర్ఖా తయారు చేయబడింది. దీని నిప్పుడు మామూలు వడ్రంగులు కూడ తయారుచేయవచ్చును.







ఈ మధ్య రష్యానుండి వచ్చి మనదేశంలో పర్యటించిన ఉజబెక్ జానపదనర్తకుల నృత్యభంగిమములలో నొకటి.

# అంతర్యాలు

రచన : శ్రీమతి కె. పార్వతి.



[ దుర్గమ్మ బిందెనిండా నీళ్లుముంచుకొని వస్తూ ఉంటుంది. దాదాపు 60 సంవత్సరాలుంటవి. కొద్దిగా ఉంటే గంపంత చేసే స్వభావం. ]

దుర్గమ్మ: ఏం వెంకాయమ్మ వదినా... నీకోరకు ఎంత సేపు ఎదురుచూచానమ్మా! చూచిమాచి రావేమోనని బయలుదేరాను... ఎందుకయిందేమిటి ఆలస్యము... అసలు వంటకూడా అయిందేమిటి?

వెంకాయమ్మ: (దుర్గమ్మ వంటిదే... కాని సాగక పోవటంతో అణిగిపోయిన విధవ) ఆс. అయినా వకటే కాకపోయినా ఒకటే! ఎంత చేసినా ఊరా... పేరా... నేనొక నిర్భాగ్యపుదాన్ని...

దుర్గమ్మ: అదేమిటి వదినా... కాపురానికి కోడలు వచ్చిన తరువాతకూడా నివే వంట చేయాలా? మీ కోడలు మంచిదేనే...

వెంకాయమ్మ: నోరు మూసికొని ఊరుకుంటే అందరు మంచివాళ్ళే... నోరు తెరచినప్పుడు వస్తుంది చిక్కు... అయినా నాకెందుకు... ఎవరెట్లు పోతే...

దు: అంతవరకూ వచ్చిందా... సరేగాని రాత్రికి పురాణానికి వస్తావా...

వెం: ఏమో వదినా... ప్రాప్తముండవద్దూ...అయినా నా మొఖానికి తోడు పురాణమా? మా కోడలు వప్పుకోవద్దూ... వస్తానమ్మా (అని చెరువుకు వెళ్తుంది)

దు: (మడితో ఉంటే మనమడు మధు తాకుతాడు) నీకేమి రోగమురా... ముదరష్టపోడా... నీ నాలిక పీక (అని తిడుతుంది)

సీత: ఏమిటత్తయ్యా! ఎందుకు చిరాకు పడుతున్నారు...

దు: యిదుగో అమ్మాయి! అనవసరంగా జగడానికి రాకు... నిన్నేమనలేదు తెలుసా...

సీ: అదేమిటంటే! అట్లా అంటారు...

దు: అంటారు-అంటారు అనరా? అందరికి లోకువయి పోయాను. ఎవరినంటే ఏమిలాభముశే! నారాత ఆ ముసలి ముండాకొడుకు ఉంటే...

సీ: మామయ్య లేకపోతే మాత్రం నీకేమి తక్కువ అత్తయ్యా! నన్ను నీకూతురిలా భావించండి... అట్లా పరాయిగా మాట్లాడుతారా - చెప్పండి మీకేం కావాలో తెప్పిస్తాను...

దు: నీవెవతివే తెప్పించటానికి... నీకు లొంగుతానటే...

సీ: లొంగటమేముందత్తయ్యా! మీకు చెయ్యక ఎవరికి చేస్తాను... అత్తవైనా తల్లివైనా మీరేకదా? అట్లు అనకండి బాధకలుగుతుంది.

దు: ఎంత నంగనాచివే... బాధ... నేను బతికుండటమే నీకు బాధ!!!

(ఇంతలో రామం ఆఫీసు నుండి వస్తాడు...అమ్మ అంటే పడి చచ్చేరకం)

రా: (కుర్చీలో కూర్చుని) ఏయ్... సీతా...రా

సీ: (వచ్చి) పిలిచిరా... చెప్పండి ఏం కావాలి... అన్నంవార్చాం...

రా: ఏమిటి ఈ రోజు విశేషాలు...

సీ: ఏమిలేవండి...

(ఇంతలో సంచితో దుర్గమ్మ ప్రవేశిస్తుంది)

దు: అయ్యో... రాముడా... ఎంత గారాబంగా పెంచానురా నిన్ను... నిన్ను విడిచి పోవాల్సి వచ్చిందిరా...

రా: అదేమిటమ్మా... అలా అంటావు... ఏం జరిగిందేమిటి?

దు: ఇంకేముందిరా... ఈ యింట్లో నే బ్రతకలేనురా నాయనా... ఆ బ్రహ్మరాక్షసి ముందర?

(217 పేజి చూడుడు)

# ఆకలిరాళ్ళు

మూలం :
రవీంద్రుడు



అనువాదం :
శ్రీ ఎన్. ఎన్. రావు

నేనూ, నా బంధువూ కలిసి కలకత్తాలో జరుగు పూజా వినోదములనుండి తిరిగి ప్రయాణము చేస్తున్నప్పుడు, రైల్లో ఒక వ్యక్తిని కలుసుకున్నాం. వాని దుస్తులనుబట్టి, వాని ఆకారాన్నిబట్టి, అతడొక ముసల్మాన్ అయివుంటాడని అనుకున్నాం. వాని సంభాషణ మాకు విభ్రాంతిని కల్గించింది. అతడు అన్ని విషయములమీదను సంపూర్ణంగా తెలిసినట్లు మాట్లాడెను. సృష్టికర్తకూడా వానిని విచారించకుండా ఏపనీచేయడేమోనని అనిపిస్తుంది. యింతవరకూ మేము చాలా సంతోషంగా ఉన్నాం. చాటున కుట్రలు పన్నుతున్నారని, రష్యనులు ముందుకు తరుముకువస్తున్నారని, ఇంగ్లీషువారి పాలసీ రహస్యమైనదని, సామంత రాజులలో కలవరం బయలుదేరినదని మాకు తెలియదు. మనము పత్రికలలో చదివే విషయాలకన్నా, అనేకమైన సంగతులు ఈ ప్రపంచంలో జరుగుతూవుంటాయి. మాకు యిల్లుతప్ప యితర విషయాలు తెలియనందున, వాని ప్రవర్తన మమ్ములను ఆశ్చర్యచకితులను చేసింది. ఏవిషయము మాట్లాడినను, ఆ వ్యక్తి దానిని సమర్థించుటకు శాస్త్ర ప్రమాణమును చూపించును, వేదములను విమర్శించును. పర్షియన్‌కవి వ్రాసిన పద్యములు చదువును. మాకు శాస్త్రములోను, వేదములలోను విజ్ఞానంలేనందున, వాని శాస్త్ర జ్ఞానము అద్భుతముగా వుండుటవలన వానియందు మాకభిలాష హెచ్చెను. నా వెంటనున్న బంధువు ఈశ్వర జ్ఞానముకలవాడగుటవలన, మాతో మాట్లాడుతున్న వ్యక్తి, ఒక అద్భుతమైన, రహస్యమైన, నక్షత్ర సంబంధమైన శక్తిని పొందినవాడని గ్రహించెను. ఆ ప్రయాణీకుడు ఏమిమాట్లాడినను, ఎంత అర్థరహితంగావున్నను, నా బంధువు భక్తి శ్రద్ధలతో వాని సంభాషణవింటూ, చాటుగా చెప్పినది వ్రాసుకొనెను. ఆ విచిత్రమైన వ్యక్తి యిదంతాచూచి సంతోషించాడని నేను అనుకుంటాను.

రైలు జంక్షన్‌కు చేరగానే, మేమంతాదిగి, మరొక రైలుకోసం, వెయిటింగు రూములో విశ్రాంతి తీసికుంటున్నాము. రాత్రి 10 గంటలయింది. రైలు ఆలస్యంగా వస్తుందని తెలిసిన తరువాత, బల్లమీద నా పక్క వేసుకొని, నిద్రపోవుటకు ప్రయత్నించాను. మాతో వచ్చిన ఆ వ్యక్తి నూలు వడుకుతూ కూర్చుండెను. నాకు మాత్రం నిద్దురపట్ట లేదు.

'పరిపాలనా వ్యవహారములలో అభిప్రాయ భేదములు వచ్చుటవలన, జూనాగర్‌లోని ఉద్యోగమునకు రాజీనామాచేసి, హైదరాబాద్ సంస్థానములో ప్రవేశించితిని. బారిచ్‌లో పన్నులు వసూలుచేయుటకు నన్ను నియమించిరి.

బారిచ్ చాలా అందమైన స్థలము. ఆ వూరిలో ఒక నది ప్రవహిస్తున్నది. దాపులో కొండలున్నాయి. నది ఒడ్డున కొండలక్రింద, చలువరాతితో నిర్మింపబడిన ఒక పెద్ద భవనంకలదు. ఊరకి దూరంగా వుంటాన, దానిచుట్టూ యిళ్లుగాని, జనసమూహముగాని లేవు.

రెండువందల యాభయి సంవత్సరాలక్రితం, రెండో మహమ్మద్‌షా తన ఆనందంకోసం, సౌఖ్యంకోసం ఆ భవనాన్ని కట్టుకున్నాడు. ఆ రోజుల్లో భవనంలో పన్నీరు చల్లేవారు. పన్నీరు ధారగా పడేటట్టు కుండులు కట్టారు. పర్షియన్ యువతులు ఆ చల్లటి చలువరాతి గదులలో కూర్చుని నృత్యగానాలు చేసేవారు. ఆ జలాధారలలో, జుట్టు విరియబోసుకుని స్నానముచేసేవారు. వీణె వాయించేవారు. ఎంతో ఆనందంగా ఉండేది.

యిప్పుడా పాటలు లేవు. ఆ ఆనందం లేదు. ఆ తెల్లటి చలువరాతి గదులలో నృత్యం లేదు. బావురమంటున్నాయి. యిప్పుడా భవనం నా బోటి బ్రహ్మచారులకు ఒంటరిగాళ్లకు, పనిలేనివాళ్లకు నిలయంగా మారింది. మా ఆఫీసు పాత గుమాస్తా కరీమ్‌ఖాన్, 'మీకు యిష్టముంటే పగలంతా అచ్చట ఉండండి. రాత్రి ఎంత మాత్రం అచ్చట ఉండొద్దు' అని తరచు మందలించేవాడు. ఆ మాటలను నవ్వులాటగా పరిగణించేవాడ్ని. నాతో ఉన్న సేవకులంతా, ప్రొద్దు గ్రుంకినదాకా పనిచేసి, రాత్రికి వెళ్ళుతామని చెప్పారు. అందుకు నేను ఒప్పుకున్నాను. ఆ చలువరాతి భవనం దయ్యాలకొంపగా పేరుపడ్డది. చీకటిపడితే, చివరికి దొంగలుకూడా అచ్చటికి రారు.

మొదట్లో ఆ నిర్మానుష్యమైన భవనం అంటే నాకు భయంగా ఉండేది. పగలంతా కష్టపడి, రాత్రికి అచ్చటకు చేరేవాడ్ని. అలసి సొలసి ఉంట్టాన, నిద్దుర బాగా పట్టేది.

ఒక వారం రోజులు గడవకముందే ఆ చోటు అంటే నాకొక విధమైన భయం ఆవరించింది. దాన్ని గురించి వర్ణించటంగాని, ప్రజలు నమ్మేటట్లు చెప్పటకుగాని సాధ్యపడదు. ఆ భవనంలో అగోచరమైనవాళ్లు తిరుగుతున్నారని నాకు తట్టింది. బహుశ నేను ఆ యింట్లో కాలుపెట్టినప్పటినుంచి, యిలాగే ఉందనుకుంటాను.

వేసవికాలం వచ్చింది. మార్కెటులో బేరం లేనందున నాకు పనిలేదు. సూర్యుడస్తమించే సమయానికి నేను నది ఒడ్డునఉన్న మెట్లదగ్గర పడకకుర్చీలో కూర్చున్నాను. నది చాలా భాగం ఎండిపోయింది. నదిలో ఉన్న యిసుక తిన్నెలు సూర్యకిరణాలకు తళతళా మెరుస్తున్నాయి. ఆ నది నీటిలోఉన్న గులకరాళ్లు ప్రకాశిస్తున్నాయి. గాలి వీచుటలేదు. అయినను ఆ కొండల దాపునఉన్న పొదరిండ్లనుండి కమ్మటి సువాసనఉన్న గాలిద్వారా వస్తున్నది.

సూర్యుడస్తమించాడు. చీకటిపడ్డది. షికారు వెళ్లుదామని లేవబోతుంటే, మెట్లమీద కాళ్ల చప్పుడు వినపడ్డది. పరికించిచూచాను. ఎవరూ కాన్పించలేదు.

ఏదో భ్రాంతిపడ్డానని మరలచ్చటనే కూర్చున్నాను. చాలామంది మనుష్యుల కాళ్లధ్వని వినపడ్డది. ఆశ్చర్యం, భయంకూడా వేసింది. నా ముందర ఎవరూ కాన్పించకపోయినను, కొంతమంది నాట్యకత్తెలు నదిలో స్నానముచేయటానికి మెట్లు దిగుతున్నట్లు గోచరించింది. కొండలవద్ద, నదివద్ద, భవనంలోను అంతా నిశ్శబ్దంగానే ఉంది. కాని నాకు మాత్రం ఆ నాట్యకత్తెలు నవ్వుతూ, ఆడుతూ, పాడుతూ ఒయ్యారంగా ఒకరివెంట ఒకరు పరుగెత్తుతూ, నన్ను గమనించకుండానే నదిలో స్నానంచేయటానికి వస్తున్నట్లు బాగా గోచరిస్తున్నది. వారు నాకు కన్పించరు. నేను వారికి కన్పించను. నది ప్రశాంతంగా ప్రవహిస్తున్నది. కాని నాకు మాత్రం ఆ నదిలోని స్ఫటిక జలం చిందుతూన్నట్లు, తుంపరలుపడుతూన్నట్లు, ఒకరిమీద నొకరు నీరు చిందకొడుతూన్నట్లు, చేతులతో పోనుకుని పారబోసినట్లు, నవ్వుతూ కేరింతలు కొడుతూ నీటిలో ఆటలాడుకొన్నట్లు, మత్యాల ఫళి పడుతూన్నట్లు తోస్తున్నది

నా హృదయం జలదరిస్తున్నది. అది భయంవలనో, సంతోషంవలనో, ఆతురతవలనో నాకు తెలియుటలేదు. ఎందువలనో కారణంచెప్పలేను. నేను వారిని చూడాలని కోరిక ఎక్కువైంది. కాని నాకు కాన్పించరు. అంతా శూన్యంగా ఉంటుంది. నేను జాగ్రత్తగా చెవులు నిక్కబొడుచుకొని వింటే, వారు అనుకునేదంతా స్పష్టంగా వినగలనని అనుకున్నాను. కాని నేను ఎంతకష్టపడి ప్రయత్నం చేసినను లాభంలేకపోయింది. కిచకిచ ధ్వనులు మాత్రం వినపడుతున్నాయి. నా ముందర వొక తెర ఉన్నట్లు, ఒక మూలనుండి కొద్దిగా తెరఎత్తి చూస్తే, చీకటిమయంగా ఉన్నట్లు తోస్తున్నది.

అమాంతంగా ఒక పెద్దగాలి వీచింది. ఆ గాలికి ఆ నదిలోని ప్రశాంతమైన నీరు గిరగిరా తిరుగుతున్నది. జలకన్యమాదిరిగాఉంది. చీకటి ఆవరించిన అడవులనుండి గోణుగుడు ధ్వని వస్తున్నది. ఇదంతా కలయో, నిజమో, అంతా మాయమైనట్లు గోచరిస్తున్నది. నాకు కనపడని ఆ వింత రహస్యపు ఆకారాలు పెద్దగా నవ్వుతూ, ఆటలాడుతూ, అమాంతంగావచ్చి ఆ నదిలోదూకి, వారి దుస్తులను తడుపుతున్నట్లు కాన్పించుచున్నది. గాలిలో సువాసన కలిసిపోయినట్లు, వారంతా నదిలో మాయమైపోయినారు.

నాకు భయంవేసింది. నేను పరధ్యానంగా ఉండటాన, నా ఒంటరితనం ఒక దయ్యంగా వెంబడించినదని, నా బోటి సామాన్య మానవుడ్ని నాశనంచేయుటకు ఆవరించినదని అనుకున్నాను. ధైర్యం తెచ్చుకొని మంచి భోజనంచేయుటకు నిశ్చయించుకున్నాను. కడుపు ఖాళీగాఉండి ఆహారం లేకపోతే, నయంగాని పెద్ద జబ్బులు వస్తాయి. వెంటనే వంటవాడ్నిపిలిచి, మంచి సువాసనగల, నిండుగా భోజనం తయారుచేయమన్నాను.

మర్నాడు ఈ ఉదంతమంతా చోద్యంగా కన్పడ్డది. టోపీ పెట్టుకొని ఉద్యోగ విధులను నిర్వర్తించుటకు వెళ్లాను. ఆ రోజు నేను రిపోర్టువ్రాయవలసి ఉంటాన, ఆలస్యంగా తిరిగివస్తాననుకున్నాను. కాని అనుకొన్నట్లుగా చీకటిపడక పూర్వమే తిరిగి రావాలని ప్రయత్నంచేశాను. రిపోర్టు పూర్తిచేయకుండానే యింటికి బయలుదేరాను. బాగా చీకటి పడ్డది. దారిలో మనుష్య సంచారములేదు. అలాగే ఆ కొండలవద్దనున్న భవనానికి చేరుకున్నాను.

దీపాలు యింకా వెలగలేదు. తలుపు తెరవగానే లోపల గందరగోళం బయలుదేరింది. అనేకమంది చిందర వందరగా త్రోసుకుంటూ, తలుపులుగుండా, కిటికీలుగుండా, తప్పించుకోటానికి ప్రయత్నంచేస్తున్నారు. అంతా మాయమైపోయినారు అనుకున్నాను.

ఇదంతాచూస్తే నాకు ఆశ్చర్యంగాఉంది. అత్తరూ, పన్నీరు వాసనలు గుమాయించి కొడుతున్నాయి. చీకట్లో ఆ స్తంభాలమధ్య నిల్చుని చూస్తూంటే, ఆ పాలరాతిమీద వీణా వాయిద్యం చేస్తున్నట్లు, సొమ్ములు గలగలామన్నట్లు, నృత్యం చేస్తున్నట్లు, పాటలు పాడుతున్నట్లు, వింత వింత విశేషాలు జరుగుతున్నట్లు గోచరిస్తున్నది.

స్పర్శించుటకు వీలుగాని, వెళ్లుటకు వీలుగాని, ప్రపంచంలో సంబంధంలేని ఈ మాయ, ఈ మంత్రం ఒక్కటే నిజమని, మిగతాదంతా కలని నన్ను ఆవరించింది. నేను ఫలానావారి పెద్ద కొడుకునని పన్నులు వసూలుచేస్తూ నెలకు నాలుగువందలు రూపాయలు సంపాదిస్తున్నానని, చిన్నకోటు ధరించి, 'సోలా'టోపీ ధరించి కుక్కలాగుడు బండిలో ప్రతి రోజూ ఆఫీసుకు వెళ్లుతున్నానని, యిదంతా హాస్యాస్పదం - కల్పితం - మాయ - బూటకంగా తెలుస్తున్నది. నిశ్శబ్దంగాఉన్న ఆ పెద్ద హాల్లో నిలబడి గుఱ్ఱం సకిలింపువలె పెద్దగా నవ్వాను.

ఆ సమయంలో కిరసనాయిలు దీపం తీసికొని నా నౌకరు వచ్చాడు. నన్నుచూచి ఒక పిచ్చివాడి మాదిరిగా భావించాడేమో నాకు తెలియదు. యిది వరలో జరిగే సంఘటనలన్నీ స్ఫురణకు వస్తున్నాయి. నా పిచ్చి భ్రమలకు నాలో నేను నవ్వుకున్నాను. కుర్చీలో కూర్చుని దీపం ఎదుట పత్రిక చదువుకుంటున్నాను.

పత్రిక చదవటం పూర్తి అయిన తరువాత, భోజనంచేసి, పక్కనేఉన్న చిన్నగదిలో పడకమీద పడుకున్నాను. కిటికీగుండా కొండలమీద ఎంతో దూరానఉన్న ప్రకాశవంతమైన నక్షత్రం చీకటిని చీల్చుకుంటూ, నా మీద కాంతిని వెదజల్లుతున్నది. అలా ఆలోచించుకుంటూ నిద్రపోయాను. ఎంత సేపు నిద్రపోయానో నాకు తెలియదు. తటాలున మెళుకువ వచ్చింది. అంతా నిశ్శబ్దంగాఉంది. ఎవరూ కాన్పించలేదు. అప్పుడే కొత్తగావచ్చిన

చంద్రుని కాంతి నా గదిలోకి వస్తున్నది.

నా కెవ్వరూ కాన్పించలేదు. కాని నన్నెవ్వరో తట్టుతున్నట్లుతోచింది. కళ్లు బాగా తెరచి చూచాను. ఆమె అయిదు వ్రేళ్లకు ఉంగరాలు పెట్టుకుని, మాటా మంతీ లేకుండా జాగ్రత్తగా వెంటరావలసినదిగా ఆజ్ఞాపిస్తున్నది. చప్పుడు కాకుండా లేచాను. ఆ నిర్మానుష్యమైన భవనంలో నేనుతప్ప అన్యులెవ్వరూ లేరు. ఆ భవనంలో అనేకమైన గదులున్నాయి. అడుగడుగుకూ భయంగా ఉంది. ఆ గదులన్నీ మూసి ఉంటాయి. ఎప్పుడూ వాటిల్లోకి వెళ్లలేదు.

అగోచరంగా ఉన్న ఆమెవెంట, నిశ్శబ్దంగా బయలుదేరాను. ఎక్కడకో నాకే తెలియదు. అంతులేని, యిరుకైన, చీకటి త్రోవలగుండా, పెద్ద పెద్ద వసారాలగుండా, అనేకములైన రహస్యపు గదులను దాటాను.

నాకు త్రోవజూపేవ్యక్తి కాన్పించకపోయినను, ఆమె ఆకారం మాత్రం నా కళ్లకు కన్పిస్తున్నది. ఆమె అరబ్బుదేశపు అమ్మాయి. ఆమె చేతులు పాలరాతివలె మెత్తగా, నునుపుగా నిగనిగలాడుతూ వుంటాయి. సన్నని గుడ్డ మొహాన వ్రేలాడుతున్నది. నెత్తిన టోపీపెట్టుకున్నది. బొడ్లో వంకర తిరిగిన బాకును పెట్టుకున్నది. అరేబియను నైట్సు కథలు గుర్తుకు వస్తున్నాయి.

చివరకు ఆమె ఒక నీలవర్ణపు స్క్రీను దగ్గర ఆగి క్రిందికి చూపిస్తున్నది. తీరా చూస్తే అచ్చట ఒక పెద్ద భయంకరమైన నీగ్రో ఆవలింతలు పెట్టుతూ, కాళ్లు చేతులూ చాచుకొని కత్తిని పట్టుకొని కూర్చున్నాడు. ఆమె ఆ నీగ్రో కాళ్లను దాటి స్క్రీనును కొద్దిగా ఎత్తినది. అచ్చట ఉన్న గదిలోని కొంతభాగము కాన్పించింది. దానిలో పర్షియన్ తివాచి పరచి ఉన్నది. ఆ తివాచి మీద పరుపు పరచి ఉన్నది. దాని మీద ఎవరో కూర్చున్నారు - ఆమె సరిగా నాకు కాన్పించుట లేదు. బంగారు స్లిప్పర్లు ధరించిన ఆమె పాదాలు గోచరిస్తున్నాయి. ఒక ప్రక్కన పళ్లెంలో నారింజకాయలు, ద్రాక్షపళ్ల గుత్తులు, యాపుల్సు, రెండు చిన్న కప్పులు సాసర్లు ఉన్నాయి. ధూపము వెలుగుచున్నది. దాని నుండివచ్చు ఆవిరి మత్తును కల్గించుచున్నది.

భయంలో వణుకుతూ ఆ నీగ్రో కాళ్లను దాటుటకు ప్రయత్నంచేశాను. పెద్దగా ఆవలిస్తూ నీగ్రో లేచాడు. కత్తి క్రిందపడి పెద్దధ్వని వచ్చింది. గభాలున దూకాను. చెమటలో తడుస్తూ ఆ పక్క మీద తడబడుతూ కూర్చున్నాను. ఈవిధంగా అరేబియను నైట్సు కథలలో ఒకటి పూర్తి అయినది. యింకా వెయ్యి కథలున్నాయి.

రోజులు రాత్రిళ్లూ సరిపడకుండా గడచి పోతున్నాయి. పగలల్లా కష్టపడి అలసి సొలసి, రాత్రి వచ్చేటప్పటికల్లా తిట్టుకుంటూ కలలు కనేవాడ్ని. రాత్రి పూట నేచేసే పగటి పనంతా అపహాస్యంగాను, వ్యర్థంగాను, నవ్వుగాను, మాయగాను తోచేది. చీకటి పడగానే మాయ ఒకటి నన్ను ఆవరించేది. నేనొక విచిత్రమైన వ్యక్తిగా మారిపోయేవాడ్ని. నే ధరించిన దుస్తులన్నీ సరిపడేవి కావు. అందుకని ఎఱ్ఱటిటోపీ పెట్టుకుని, పైజమాలు ధరించి, సిల్కు గౌను తొడుక్కుని, అత్తరు రాసిన రంగు రంగుల జేబురుమాలా పట్టుకుని, మెత్తటి పాన్పువలె నుండు కుర్చీలో కూర్చుని, ప్రియుడు ప్రేయసికోసం ఎదురుచూస్తూన్నట్లు ఉండేవాడ్ని.

చీకటి పడుతున్నకొద్ది జరిగే విచిత్ర సంఘటనలను గూర్చి వర్ణించటం నాశక్యంకాదు. వాటికి మొదలూ చివరాలేదు. రాత్రల్లా వాటిని తెలుసుకొనుటకు ఆగదులన్నీ కలియ తిరిగేవాడ్ని. ఇతంతా సత్యమో అసత్యమో నాకే తెలియదు. వీణావాయిద్యాలు, సంగీత వాయిద్యాలు, నృత్యాలు, ఆటలు పాటలు, కేరింతల వాతా

వరణంలో, కొన్నొక క్షణం పాటు చక్కటి నాట్యకత్తెను చూచేవాడ్ని. ఆమె రంగురంగుల పైజమాలు ధరించును. పాదాలకు బంగారపు స్లిప్పర్లు తొడుగును. ఎఱ్ఱటి టోపీ ధరించును. తెల్లటి మంచు గడ్డవలె శరీరచ్ఛాయవుండును.

ఆమెను చూస్తే నాకు పిచ్చెత్తేది. ఆమెకోసం రాత్రిళ్లు గదులన్నీ వెతికేవాడ్ని. త్రోవలన్నీ చూచేవాడ్ని. ఈ మాయలో పడి కొట్టుకునేవాడ్ని.

ఒకొక్కప్పుడు పెద్ద అద్దంముందర నుంచుని ఒక రాజకుమారునిగా భావించుకుని ఆలోచించేవాడ్ని. అప్పుడు నా ప్రక్కన పర్షియన్ కిన్యల అందం నృత్యం చేస్తున్నదనుకుంటాను. తటాలున మెడలు అటూయిటూ తిప్పే పర్షియన్ యువతి, ఆమె లోతైన నల్లని కళ్లనుండి వెలువడే అంతులేని ప్రేమ, ఆమె ఎర్రని పెదవులనుంచి తొణికిసలాడే మాటలు, ఆమె మిసమిసలాడే ఆకారం, వికసించిన పూలతీగవలె ఉంటూ, నా హృదయాన్ని కలతపెట్టేది. ఆమె నవ్వులు, ఆమె దుస్తులు, వర్ణించుటకు వీలులేని సౌందర్యం, ఆమె చూపులు, కొండల మీదనుండి వీచు చల్లటి పిల్లవాయువులు, ఆ గాలికి దీపం అరిపోటం, కళ్లు మూతలు పడటం, శరీరం పులకరించటం, ఆమె నన్ను తన మృదువైన హస్తాలతో స్పృశించటం, ఆ తాకులు, అత్తరు పన్నీరులలో నిండిన చేబురుమాలతో విసరటం, నా బుగ్గలను ఆమె చునివ్రేళ్లతో కొట్టటం, వివిధ విధాల ఆలోచించుకుంటూ పడుకునేవాడ్ని. పామువలె చుట్టలు చుట్టుకొని నామీదవాలటం - యింతలోకే నేనొక నిట్టూర్పు విడవటం సంభవించేది.

ఒక రోజు సాయంత్రం గుఱ్ఱం మీద స్వారీచేయుటకు నిశ్చయించుకున్నాను. ఆరోజు ఎవరూ చెప్పినా వినదలచుకోలేదు. నా ఇంగ్లీషు కోటు, టోపీ, ర్యాకుమీద ఉన్నాయి. వాటిని తీసికొనుటకు ప్రయత్నంచేసేటప్పటికి, అమాంతంగా ఒక పెద్ద సుడిగాలి వచ్చి, వాటినిండా నదిలోని యిసుక, దుమ్ము, కొండలమీదనుండి ఎండిపోయిన ఆకులు పడినాయి. పకపకమని పెద్దగా నవ్వుతూ, నవ్వు మాయమైపోయింది.

ఆరోజున స్వారికి వెళ్లలేదు. అర్ధరాత్రి హృదయాన్ని చీల్చే పెద్ద పెట్టున ఏడ్పులు, నా ప్రక్క క్రింద, భూమి మీద, ఆ పెద్ద విశాలమైన అంతులేని భవనంలోను వినపడుతున్నాయి. 'నన్ను రక్షించండి! ఈ మాయలనుండి కలలనుండి బయటకు రండి - నిద్రలేవండి - మీ హృదయానికి హత్తుకొనండి, మీప్రక్కన కూర్చోపెట్టుకుని, కొండల మీదుగా అడవులగుండా, నదిప్రక్కగా స్వారి చేయండి' అంటున్నాయి.

నేనెవ్వరిని? ఎలా రక్షిస్తాను? ఓ! ఏమి అందం? ఏమి ప్రేమ? ఎట్లా ఈ మాయనుండి ఒడ్డుకు చేర్చేది? ఎక్కడ ఉంటున్నావు? ఏమిటీవిచిత్రం? ఈ చరిత్ర ఏమిటి? ఆ సంగీతం - ఆ వీణా వాయిద్యాలు - కత్తుల తళతళ మెరుపులు - అబ్బా ఏమి అందం - ఏమి వైపరీత్యం - అంతా విచిత్రంగా ఉంది.

అమాంతంగా, మొహరాలి 'అవతలికి - అవతలకి యిదంత మాయ - నిజంకాదు అసత్యం.నమ్మద్దు' అని అరిచాడు. కళ్లు తెరిచాను. వెలుతురువచ్చింది. నౌకరు వచ్చి ఉత్తరాలిచ్చాడు. వంటవాడు నిలబడ్డాడు.

'నేనిచ్చట ఉండలేను' అని చెప్పాను. సామానులు సర్దుకుని ఆఫీసుకు మకాం మార్చాను. కరీమ్ ఖాన్ నన్ను చూచి నవ్వాడు. నేను పట్టించుకోకుండా నా పని నే చూచుకుంటున్నాను.

సాయంత్రం కావస్తున్నది. నాలో జ్ఞాపకశక్తి తగ్గిపోవుచున్నది. లెక్కలు తనిఖీ చేయుట, పని సక్రమంగా నెరవేర్చుట - అన్నీ అయోమయంగా వున్నాయి - యివన్నీ ఎందుకూ పనికిమాలినవాటిగా భావించాను - వాటిని చూస్తే ఏవగింపు, ఏహ్యభావం కలుగుతున్నవి.

కలం క్రింద పెట్టాను. పుస్తకాలు మూసివేశాను. బండి ఎక్కి బయలుదేరాను. ఆ భవనానికి చేరేటప్పటికి, కొద్దిగా వెలుతురు ఉంది. మెట్లు ఎక్కి గదిలో ప్రవేశించాను.

అంతా నిశ్శబ్దంగా ఉంది. ఆ చీకటి గదులన్నీ కళ కాంతులు లేకుండా వున్నాయి. నా మీద పగ సాధించాలన్నట్టుగా వున్నాయి. నా హృదయం చాలా బాధపడ్డది. పశ్చాత్తాపముతో నిండినది. క్షమార్పణ చెప్పటకు అచ్చట ఎవరూ లేరు. ఆలోచనలేకుండా చీకటి గదులన్నీ కలియ తిరిగాను. వీణె ఉంటే పాటపాడుదామనుకున్నాను. 'భయపడి పారిపోయి తిరిగి వచ్చాను - నా తప్పు క్షమించండి - ఈ పేదవాడ్ని కనికరించండి. మీలో కలుపుకోండి' అన్నాను.

తటాలున రెండు కన్నీటి బొట్లు నా కనుబొమ మీదపడినాయి. కొండలమీదకి నల్లని మేఘాలు గుంపులు గుంపులుగా వచ్చినాయి. కొండలదాపున ఉన్న అడవులు, నగిలోని నీరు ప్రశాంతంగా వున్నాయి. హఠాత్తుగా పిచ్చివాడు గొలుసులను త్రెంపుకుని పిచ్చిగా అరచినట్లు, ఉరుములు మెరుపులతో పెద్దగాలి తుపానువచ్చింది. దానికి భూమి, ఆకాశము, నీరు గజగజలాడుతున్నాయి. అ గాలికి భవనంలో ఉన్న తలుపులన్నీ కొట్టుకుని పెద్దధ్వని చేసినవి.

నాకర్లంతా ఆఫీసులో ఉంటాన, దీపాలు వెలిగించలేదు. ఆకాశం మేఘాలతో నిండిపోయింది. చంద్రుడు ఉదయించలేదు. అట్టి వాతావరణంలో ఒక స్త్రీ తివాసిమీద పడుకుని వ్రేళ్లతో జుట్టును సవరించుకుంటూ ఉన్నట్లు నాకు బాగా గోచరిస్తున్నది. ఆమె అందమైన కనుబొమల నుండి నెత్తురువస్తున్నది. ఆమె పిచ్చిగా అదోకరకమైన నవ్వు నవ్వుతూ, మధ్యమధ్య విలపిస్తున్నది. పెద్దగా వర్షం కురుస్తున్నది. వర్షం కిటికీలోగుండా పడి ఆమె తడిసిపోవుచున్నది. రాత్రల్లా వర్షం కురుస్తూనే ఉన్నది. బరువెక్కిన హృదయంతో ఆ చీకట్లో గదులన్నీ తిరిగాను. ఓదార్చటానికి అచ్చటెవ్వరూ నాకు కాన్పించలేదు. ఈ ఖరింప లేని విచారము ఎక్కడిది? ఎచ్చటనుండి వస్తున్నది?

ఆ పిచ్చి మెహరాలి, 'అవతలకు! అవతలకు! ఇదంతా అసత్యం - మాయా' అని అరిచాడు.

తెల్లవారినది. మెహరాలీ అరుస్తూ ఆ భవనం చుట్టూ తుపానులో తిరుగుతున్నాడు. బహుశ అతడు ఒకప్పుడు ఈ భవనంలో నివశించాడని, అతడు పిచ్చివాడైనప్పటికి మామూలుగా ప్రతిరోజూ వచ్చి, ఆ యువతి మాయలో పడి తిరుగుతూవుంటాడని నాకు జ్ఞాపకంవచ్చింది.

పెద్దగాలివాన వీస్తున్నప్పటికీ, నేను వానివద్దకు పరిగెత్తి, 'హో మెహరాలి, ఆ బూటకం ఏమిటి?' అని అడిగాను.

నాకు జవాబు చెప్పకుండా అవతలకు నెట్టి, మామూలుగా వాని ధోరణిలో, 'అవతలికి! అవతలికి! యిదంతా వట్టి బూటకం! కల్ల! మాయ!' అని అరుస్తూ తిరుగుతున్నాడు.

పిచ్చివాని మాదిరి వర్షంలో ఆఫీసుకు పరుగెత్తి కెళ్లి, కరీమ్‌ఖాన్‌ను ఈ మాటల అర్థం చెప్పమని అడిగాను. ఆ ముసలాడు చెప్పిన మాటలలోని భావము యిది.

'ఒకప్పుడు ఆ భవనంలో, తీరని కోరికలతోను, ప్రతిఫలంలేని ప్రేమకలాపాలతోను, అంతులేని సౌఖ్యాలతోను తులతూగుతూ వుండేదని, అనేక మంది పర్షియను సౌందర్య యువతులు నృత్యం, సంగీతము పాడేవారని, యిప్పుడా భవనమంతా పాడుపడిపోయి, ఆ యువతుల వాంఛలు తీరనందున, ఆ భవనంలోని ప్రతి అణువూ, రాయి ఆకలి దప్పులతో అలమటించిపోతున్నదని, ఎవరైనా పొరపాటున అచ్చటకువస్తే, బ్రహ్మరాక్షసివలె వీరంతా పైనపడతారట. మూడు రాత్రులు ఆ భవనంలో

గడిపేటట్లయితే, ఈ బాధలకు లోనుకావాల్సిందే. ఈ మాయలో పడిపోవాల్సిందే.'

'అయితే వీటినుండి తప్పించుకునేమార్గంలేదా?' అని అడిగాను.

'ఒకటే మార్గం ఉంది. అది చాలా కష్టం - అదేదో మీకు చెప్పే ముందర, పర్షియను యువతి యొక్క హృదయ విదారకమైన గాథను తెలుసుకోవాలి - ఆమె అచ్చట నివసించింది' అన్నాడు ముసలాడు.

ఆ సమయంలో కూలీలు రైలువస్తున్నదని చెప్పారు. వెంటనే సామాను సర్దుకున్నాం. ఒక ఇంగ్లీషు దొర ఫస్టుక్లాసు పెట్టెలోనుండి, స్టేషన్ పేరు చదువుటకు తొంగిచూస్తున్నాడు. అతడు మా ప్రక్క ప్రయాణీకునిచూచి, 'హల్లో' అంటూ వాని కంపార్టుమెంటులోనికి తీసుకువెళ్లాడు. మేము రెండవ తరగతి పెట్టెలో కూర్చున్నాం. ఆ వ్యక్తి ఎవరో, వానికథ ఏమిటో మాకు తెలిసికోటానికి అవకాశంలేకపోయినది.

'కథంతా మొదలునుంచీ, చివరదాకా కేవలం కల్పితం - మనల్ని తెలివితక్కువ వాళ్లతో జమకట్టాడు' అన్నాను. తరువాత జరిగిన సంభాషణ నాకూ, నా బంధువుకూ జీవితాంతంవరకూ ఎడబాటు కల్గించినది.

# శ్రీ రామ కర్ణామృతము



(ఆంధ్రానువాదము)

శ్రీ కల్లూరి, అహోబలరావు

## ప్రథమాశ్వాసము

(గతసంచిక తరువాయి)

౧౧

రామచంద్ర! రఘూత్తమా! రాజవర్య! — రాజ రాజేంద్ర! సురరాజ! రాఘవేశ!
రామభద్రుండ! రఘువంశ రాజతిలక! — శరణుజొచ్చితి; దాసుండ! జయమునిమ్ము!

౧౨

కోటిమెఱపుల కాంతితో సాటివచ్చు — కాంతిగల వస్త్రము ధరించి — శాంతమూర్తి
వగుచు, వీరాసనముబొంది — యవనిజాత — నీదుతొడమీదఁ గూర్చుండినెగడ, నామెఁ
కౌగిలించియు, మఱియొండు కరముచేత — బ్రహ్మతత్త్వంబు మునులకు రక్తిఁదెలుపు
రామ! పద్మాక్ష! శ్యామాంగ! ప్రార్థనంబుఁ—జేసి, సేవింతు సతము—రక్షింపుమయ్య!

౧౩

రఘువంశతిలకుండు — రాముండు నా తండ్రి! — భూదేవి కొమరిత నాదుతల్లి!
బ్రహ్మ సఖుండైన — పావని నా భ్రాత! — సాదరంబు — విరక్తి నాదుభార్య!
ఇంద్రియ నిగ్రహంబిమ్ముగా సాధించి — నట్టి, విశ్వామిత్రుఁడనఘమూర్తి
యా విభీషణుఁ డాదియగు సజ్జనంబులు — నా మిత్రులైనారు — న్యాయముగను
విమల హరిపాద భక్తియే వెతలమాన్పి—యోగమునుగూర్చి, యిచ్చు సంయోగసుఖము;
కోరికలఁ దీర్చునట్టి, వైకుంఠమరయ — నాకు - నిత్య నివాసంబు ప్రాకటముగ

౧౪

నంద నందనుఁడ! గోవింద! నృసింహావతార! ఆనంద! సత్య స్వరూప!
దామోదరా! ముకుందా! వాసుదేవ! ప-ద్మాక్ష! సీతాపతీ! మాధవుండ!
పాప సంహారకా! పతితపావనరూప! — సంసార విస్తార జలధిదాట
గాఁజేయు, గంభీర కర్ణధారుండ! శ్రీ కృష్ణావతారుఁడౌ! విష్ణుదేవ!
కాంతిచే, మనోహరుఁడవై గ్రాలువాఁడ! — అచ్యుతానంత! శ్రీరామ! ఆదిదేవ!
నిత్యతాపత్రయంబు ఖండించి, నాకు — సంతస మొసంగుమా — రామచంద్ర సతము.

౧౫

విప్రప్రియుండవై - పేరునుగొన్నావు - కరుణాకరుండయి గ్రాలినావు
ధర్మస్వరూపుఁడై! దనరినవాఁడవు సీతకు భర్తవై, చెలఁగినావు
రాత్రించరుల, సంహరణ మొనర్చితివీవు! - కోటి, విద్యుత్కాంతిఁ గూడినావు
మాయా మృగంబును - మర్దించినాఁడవు! - కాకుత్స్థవంశాన గ్రాలినావు
లక్ష్మణునితోడ సతము వెలంగినావు - ధరణి, రఘుకుల శ్రేష్ఠుఁడై దనరినావు
సుందరాకార! కుండల శోభితాంగ! - రామచంద్ర! రక్షింపుమా! ముకుంద!

౧౬

రత్నకిరీటంబు - రత్నకుండలములు - ధరియించి, రామచంద్ర ప్రభుండు
భుజకీర్తులనుగల్గి, పొలుపొందు హారముల్ - కంఠసీమ, ధరించి - కాంతసీత
వామభాగమునందు, వసియింపగాఁ దాను - సింహాసనమునందు చేరియుండి,
వానర వరులెల్ల, మాననీయముగఁ దగ - సేవింప, మునులెల్లఁ జేవొగడ
వారి కభయమొసఁగి, కోరికలీడేర్చు - జానకీధవుండు సాయుఁడగుచు
నాదుకోర్కెఁ దీర్ప సాదరభక్తితోఁ - బ్రార్థనంబొనర్చి ప్రణుతిసేతు.

౧౭

భూసుతతోఁ గూడి, పొలుపొందు రాముండు - నా హృదయమునఁ జెన్నారుగాత!
తమ్ములతో గూడి, దనరెడి రాముండు - నా నమస్సుఁ గొనుఁ బూర్ణంబుగాఁగ,
మనసున - వాక్కున - మత్కాయమున - నేను - చేసిన కర్మల, శ్రీ రఘూత్త
మునకు, నర్పింతు; నా యనఘు పాదంబుల - కంజలి ఘటియించి - యధికభక్తి
పాపములనుండి రక్షింపఁ బ్రార్థనంబు - సేతు; పదునాల్గు లోకముల్ సేమముగను
కుక్షియందుంచినాఁడవో కోమలాంగ! - వీర! శ్రీరామ! రక్షింపు - శ్రీ రమేశ!

౧౮

రాజులలో, శ్రేష్ఠుఁడై - జగంబుల కప - కారంబు సేయు, రక్కసుల నడఁచి
లోకహితమొనర్చి, లోకుల రక్షించి - గుణనిధివై, కీర్తిఁ గన్నరామ!
మరకత రత్నసమ్మానిత, తనువుచే - శోభించుచున్నట్టి సుందరాంగ!
కౌసల్య పుత్రుఁడై, వాసిఁ గాంచెదు, హస్త - పద్మంబులనుగల్గు వారిజాక్ష!
రఘుపతీ! జానకీపతీ! రమ్యగుణప - తీ! త్రిలోకపతీ! నిన్నుఁ దేఁటభక్తిఁ
ప్రార్థనము సేతు సతతంబు; పాపములను - బాపి, రక్షింపుమా! రామభద్ర! నన్ను.

౧౯

షట్కోణ పీఠమాసనముగాఁ గూర్చుండి - వీరాసనముబూని వేడ్కతోడ
మోకాలిపై, హస్తమునుగల్గి, వామభా - గంబున - భూజాత గ్రాలుచుండ,
జ్ఞానముద్రనుగల్గి, జ్ఞానోపదేశంబు - హనుమంతునకు, సల్పుచును, ముదంబు
వఱలఁగా, సుగ్రీవ భక్తుండు నినుసేవఁ - జేయ, లక్ష్మణుఁడు దాచేతులందుఁ
బూని, శరచాపముల, నిన్నుఁ బూర్ణభక్తి - సేవసలుపుచునుండగా, శ్రీ రఘూత్త
మా! వెలయుచున్న వాఁడవు ; మనసునందు - నిన్నుఁ జింతింతుఁ బ్రోవుమా -
సన్నుతాంగ!

౨౦

సౌమిత్రి మిత్రుఁడై, సత్యస్వరూపుఁడై - సురముని వినుతుఁడై - సుందరాంగ!
రామచంద్రుండవై, రఘుపతివై, రాక్షస, కులనాశకుఁడవై - సార్వభౌమ!
శ్రీ రమేశుండవై, సీతామహాదేవి - సౌందర్యపాత్రుఁడై - సరసిజాక్ష!
నీలమేఘశ్యామ! నిత్యవందితపాద! - రమ్యకోదండధారణ! ముకుంద!
వెలయుచున్నావు ; శ్రీ రఘువీర! రామ! - నిన్ను స్మరియింతు సతతంబు నేమముగను
నాదు తాపత్రయంబుఁ బోనాడఁజేసి - రక్షణముసేయుమయ్య! శ్రీరామచంద్ర!

(సశేషము)

# కొండవీటి కొనలు

శ్రీ చిల్లా వెంకటకృష్ణమూర్తి

ఆంధ్రదేశము, తెలుగుభాష అను పదములను స్మరించినతోడనే దానిలో ఏదో మహోత్తమమైన పవిత్రత, నిగూఢమైన మహిమగలదను భావము ఆంధ్రుడయిన వానికి గోచరించకమానదు. "ధనం మూల మిదం జగత్," అనునయోక్తిచేత అర్థం చేతనయితేనేమి, మానవుని విశేష శక్తి వలననయితే నేమి పూర్వాంధ్రులు తెలుగుతల్లికి చేసినసేవ మిక్కిలి కొనియాడదగియున్నది. అందుకు నిదర్శనముగా ఆంధ్రుల కీర్తిని వేనోళ్ళచాటు హంపీశిథిలములు అజంతాగుహలు, కొండవీడు శిథిలములు మోటుపల్లి ఓడరేవు మొదలగునవి. ఇవి పూర్వాంధ్రమున అఖండ ఐశ్వర్యములతో వెలిగి తుదకు ఈ నాడు వెలలేని, ప్రతిభలతో ఘుమ, ఘుమలాడుచు, తెలుగువారికీర్తిని వేనోళ్ళచాటుచు, ఆంధ్రుల పిత్రార్జితమున్నట్లు మచ్చుముక్కలై నిలచినవి. కావుననే ఈ నాడు పూర్వాంధ్రుల కీర్తికాంతులలో భారతదేశము పలుదేశములకన్న మిన్నకను మిన్నగా యుండుటయే అందుకు ప్రత్యక్ష నిదర్శనము.

పూర్వాంధ్రములో కొండవీటి రాజ్యము అను రుల రాజ్యమును తలదన్నునట్లు తేజోవంతముగా వెలిగిపోయిన రాజ్యములలో నొకటి. దానిపాలకులు పెక్కుమంది అయినప్పటికి, రెడ్డి రాజుల కాలములో దానికి చరమదశ సంప్రాప్తమయినది. "వెలుగుట విలుగుట కొఱకే," అనునయోక్తిచేత కొండవీడు చరమదశ నొందుటకు ప్రబలమయిన కారణ మొకటున్నది.

పూర్వము కొండవీడు రాజ్యమును రెడ్డిరాజులు పరిపాలించుకాలమున ఒక బ్రాహ్మణుడు తపస్సు చేసుకొనుటకై పలుచోట్ల తిరిగి, తిరిగి చివరకు కొండవీటి రాజ్యమందు అనువగు ప్రదేశమును చూచుకొని స్థావరమేర్పరచుకొనెను. ఆ బ్రాహ్మణునకు ఒక ద్రవముతోగూడిన కమండల మొకటిగలదు. దానిని ప్రాణ మొకెత్తుగా కాపాడుచుండెను. తపస్సు చేసుకొను స్థలమునకు సమీపమున ఒక వృక్ష శాఖకు దానిని తగిలించి, నితరుల చేజిక్కదని మనస్సు స్థిమితపఱచుకొని నిశ్చింతగా తపమాచరించుచుండెను. దైవ దుర్విపాకమున కమండలములోని ద్రవము క్రిందనున్న నాగలిపైపడెను. రోజులు గడువ ఆ బాపడు తపమాచరించుచుండెను.

కొంతకాలమునకు తొలకరివానలు భూమాతను శాంతి పరచుచున్నవి. రైతులు ఏరువాక సాగించ బలిసిన బసవయ్యలతో భూమిని దున్నుటకు బయలుదేరారు. రైతులు వచ్చి నాగలిని చూచుసరికి సూర్య కిరణములలో ఆ నాగలి బంగారు మెరుపులతో మెఱయుచుండెను. ఆనందంతో చుట్టు కలయచూడసాగిరి. కొద్ది దూరములో ఒక బ్రాహ్మణుడు తపమాచరించుట చూచిరి. వృక్ష శాఖకు తగిలించిన కమండలమును చూచిరి. ఈ కమండలము ఆబ్రాహ్మణుడిదని, కమండలములోని ద్రవము కొయ్యను బంగారము చేయునది అని నిశ్చయించి తమ పాలకుడగు రెడ్డిరాజు కెఱింగించిరి. ఆ రాజు పేరాశగలవాడై తన సేవకులచేత ఆ కమండలమును తెప్పించి, రాజ్యములో కొయ్యలన్నింటిని బంగారముగా మార్పించెను.

కాలము గడచిన తరువాత ఆ బ్రాహ్మణుడు చూచుసరికి కమండలము లేకుండెను. సంగతంతా జ్ఞానదృష్టిచేత తెలిసికొని ప్రళయ కాలపు రుద్రునివలె నిప్పులు గ్రక్కెను. చివరకు ఎట్లైన రెడ్డిరాజులను నాశనము చేయవలయునని ప్రతిజ్ఞబూనెను. తరువాత పాశ్చాత్యుల స్నేహము సంపాదించి ఒక పన్నుగడ పన్నెను. కొండవీటి రాజ్యమందు ఒక

చీకటి గృహమందు ఒక కత్తుల బావిని తనమహిమచేత నిర్మించెను. ఆగృహమునందున్న కత్తుల బావిగల గది పాణిద్వారమునకు పోవుగగిలో నుండెను. ఒకమూల ఒకప్రమిద గ్రుడ్డివెలుగు నిచ్చుచుండెను. తరువాత ఆ బ్రాహ్మణుడు రెడ్డిరాజులందరిని ఎందుకు ఆహ్వానించెను! - అందుకు ఒక నియమము పెట్టెను. విందుచేసిన పిమ్మట పాణి ద్వారముగుండా పోవలయునని చెప్పెను. ఏదో ఛాందస బ్రాహ్మణుడని విందు చేసిన పిమ్మట ఒక్కొక్క రాజు పోవటము-బావిలో పడటము జరుగుచున్నది ఆయేలికగాడు అమ్మయ్యో! అను శబ్దము చేసినను ఆ శబము బావిలోనే నింకిపోవుచుండెను. చివరకు ఒక రాజు పోయిన రాజులందరు రాకపోవుటచూచి విందులో నేదో మోసమున్నదని తెలిసికొని పలాయనము చిత్తగించెను. తరువాత ఆద్విజుడు యింత మందిని చంపి జీవించుట తగదని తానుకూడా ఆ బావిలో పడి మరణించెను. ఇట్లుకొండవీటి రాజ్యము చరమదశ సంప్రాప్తమయినది.



నాగార్జున ప్రాంత ఆటవిక కాంతలు

Photo by : Sri. M. G. Menon

# భక్తియే ముక్తి నొసగును

శ్రీమతి ఎచ్. కనకలక్ష్మమ్మ

భక్తియే ముక్తి నొసంగునది. జన్మమును చరితార్థ మొనరించుకొనుటకు భక్తియే ముఖ్యసాధనము. భక్తియనిన ఒక స్థలమున దొరుకునదిగాదు. ఎంత ధనమునిచ్చియైనను భక్తిని సంపాదింపజాలము. నిజమునకు నేర్చుకొనిన వచ్చు విద్యగాదు. జన్మ సంస్కారమున్నవారలకు దానంతటదియే గలుగును. తెలియనివారలు సాధనములుచేసి, సత్సాంగత్యము, భక్తి జ్ఞానములుగల గ్రంథరాజముల పఠించి తెలుసుకొనవచ్చును. లోకమున నెల్లరకు కొంచముగాకున్న కొంచమైనను భక్తిని గలిగియే యుందురు. ఎట్లనిన ? మాతృభక్తి, పితృభక్తి, పతిభక్తి, దైవభక్తి, నీతి, ఓర్పు, సహనము, యివి యెల్లను భక్తినే చెందుతవి. కావున భక్తియనిననేమో తెలియని వారరుదు.

అయిన భక్తియనిన నవ్వులాటగాదు. కత్తిమీద సామువంటిది. ఎప్పుడు మనలను మనము భగవంతున కర్పణముజేసి కొంటిమో, అప్పటినుండి, ఆతనికి దాసులము. కాన, ఆతని చెప్పుచేతలలో నుండవలసినవారము. అనగా ఆతని సంకల్పమెఱిగి వర్తించుట. ఆతనికి సంబంధించిన విషయములలో జీవితమును గడుపుట.

ఇంకను నవవిధ భక్తులగు శ్రవణ, కీర్తన, స్మరణ, అర్చన, దాస్య, సఖ్య, పాదసేవన, వందన, ఆత్మనివేదన, యను నవవిధ భక్తుల నలవరచుకొనవలయును. వానిని ఒక్కొక్కటిని అభ్యాసముచేసి అలవరుచుకొనవలయును. చివరికి ఆత్మనివేదనతో భక్తిని బొందగల్గుదురు. మొదటి ఆరుమెట్లగు శ్రవణ, కీర్తన, స్మరణలకన్నను, ఆత్మనివేదనము సంపూర్ణ భక్తికి చెందుచున్నది. అనగా భగవానుని జూపుచున్నది.

భగవానుని కృపగలవారలకు, జన్మతహ భక్తి కుదురును. మీరాబాయి, సక్కుబాయి, ప్రేమాబాయి, ప్రహ్లాదుడు, యిట్టి భక్తశిఖామణులు పుట్టుకతోడనే భక్తియను మహాధనమును గల్గియుండిరి.

కొందఱికి అభ్యాసము చేయుచున్న మీదట దృఢతరమగు భక్తికలుగుచున్నది. సాధనముమీద సమకూరనివేవియునుండవు. తీవ్రసాధనజేయువారలకు సాధ్యముగానిదేదియు నుండబోదు. ఇహపరసాధనము భక్తియే! సంసార

మునగల్గు సర్వదుఃఖములనుండి తరింప జేయునది భక్తియే! భక్తికి సులభము కాని కార్యములేదు. భగవానుని భక్తి సులభుండను నామధేయము పొందిన దందు కొఱకే.

ద్రౌపదికి తన మానభంగమందు రక్షించినది తన యఖండ భక్తియేగదా? ఐదుగురు భర్తలుండియు, కష్టసమయమున ఆదుకొననేరరైరి. స్త్రీ పురుషులెల్లరును, భక్తి నాశ్రయించి తమ తమ జీవితముల నిరపాయములుగను, ఆనందమయములు గను జేసికొనవలయును.

హరిశ్చంద్రుని సత్యదీక్షను భక్తిగల తన హృదయమే కాపాడినది. సత్యభామ తనవద్దనున్న సమస్తాభరణములను, వెండి బంగారమును, యనేక మణులను వైచినను, శ్రీకృష్ణు తులాభారమును జేయలేకపోయినవి. శ్రీ రుక్మిణిమాత యొకానొక తులసీదళమును త్రాసున నుంచినంతనే జగన్నాథుడు, ఆ తులసీ మహాత్మ్యముచే సరితూగెను. యిట్టి భక్తవతంసులు భగవానునికి సములని జెప్పినను తప్పులేదు.

భగవంతుడు తన భక్తులను పరీక్షించుటకు బహు భంగుల వెతలబెట్టి శోధించును. వారల యోర్పును బరీక్షించును. బంగారమునకు సుత్తిదెబ్బ కాంతి నిచ్చునట్లు, వీరలకు ఆతడు బెట్టు వెతలు వారల హృదయములందుండు మలినమును బోద్రోలుటకు, అట్లు యినుములం గుడుపును.

కావున భక్తియను పదమునకు సంపూర్ణార్థము ఓర్పు, లేదా సహనముయని జెప్పనొప్పును. సహనమే సతీత్వము. మరియు, భక్తియను నమృతము, ఏమానవవుని హృదయములందుంటున్నదో, వారలు కష్టములను నాపదలెట్టివైనను నిట్టే దాటెదరు. వారలు జీవిత ప్రవాహమునగల్గు సుఖదుఃఖ పరంపరలకు చలించరు. అనగా సుఖముగల్గిన ఆనందించరు. దుఃఖము గల్గిన దుఃఖించరు. ఇందుల కుదాహరణము కుచేలుడు నూరుగురు సంతానమునుబొంది, తినుట కాహారములేక, కట్టబట్టలేక, నిలువనీడయనునది లేక నానా శ్రమలబడుచున్నను, ఆతడు చలించలేదు. బిడ్డలు అన్నమో రామచంద్రా యని దీనాలాపములాడుచున్నను, ఆ మహా భక్తుని చెవిదూరలేదు. కడకు భార్య నిర్బంధముచే భగవానుడైన కృష్ణమూర్తి యొద్దకు జనెను. భక్తుల యవసరముల దీర్చుటలో ఆతడు బద్ధకంకణుడుగదా? ఆతని నోట బలికించకయే, అపారసిరులొసంగి రక్షించెను. మరియు మహా భక్తుడగు సంపాతికి మోక్షమివ్వలేదా? ఆంజనేయుని తన హృదయమున నిలుపుకొనలేదా! గజేంద్రుని గాపాడలేదా! శబ

రిని గావలేదా? వారు వీరనక స్త్రీ పురుషులను బేధములేక కుల, మతముల, నెన్నక, భక్తి సలుపు యెల్లరను బ్రోచుటయే ఆతనిపని! మనము తలంచుటయే ఆలస్యముగాని, ఆతడు వచ్చుటాలస్యము లేదు ఆతని త్వరలో బొందవలయునను తీవ్రేచ్ఛగలవారల కాతడు, తీవ్రభక్తి నొసంగి తనయందు జేర్చుకొనును. ఆత్మ నివేదన యనగా? భక్తుని తనయందు అనన్యముగ జేర్చుకొనుటయే! భగవానుడు వేరు, భక్తుడు వేరుయను భావబేధ ముండదు. జీవస్వరూపుడగు భక్తుడు, పరమాత్మయగు పరమేశ్వరునందు సాయుజ్యమును బొందును. దీనినే సాయుజ్య ముక్తి యందురు. దీనికన్నను మించిన భక్తి వేరులేదు. సామీప్య, సాలోక్య, సారూప్యములు మూడును ముక్తులే! కాని అవి సాయుజ్యపదవివంటివి కావు. కల్పాంతమందు యీ మూడు ముక్తులును నాశనమును బొందునవియే! కాని సాయుజ్యముక్తి కల్పాంతమందును నశించునదిగాదు. భగవానుడెట్లు అవినాశియో, యీ సాయుజ్య ముక్తియటుల నాశవంతముగానిది. కడకు మూడు లోకములు, ముమ్మూర్తులును నాశనము బొందునవియే! కాని సాయుజ్యముక్తి కల్పాంతమందును నశించునదిగాదు. భగవానుడెట్లు అవినాశియో, యీ సాయుజ్యముక్తి యటుల నాశవంతముగానిది. కడకు మూడులోకములు, ముమ్మూర్తులును నాశనము బొందునవియే! గాన వాటికన్నను సాయుజ్యము శ్రేష్ఠము. జనన మరణములు తప్పించుకొనగోరువారలు సాయుజ్యమును బొందియే తీరవలెను.

# కాలిబాట

## "పగడండీ"

మూలం : శ్రీ కమలాకాంతవర్మ

అనువాదం : "ప్రవాహ"

(గతసంచిక తరువాయి)

పగడండి ఏమి చెప్పలేదు.

బాలి:- నేనీ కెప్పుడో చెప్పవలెనని అభిలషించితిని. నీవే స్వయముగా వెళ్ళుటకు నిశ్చయించుకొన్నావు. యిది యింకా మంచిది.

పగడండి:- నేను అన్యమనస్కురాలనై ప్రపంచంలో ఏంజరుగుతుందో అదిశాగా అవుతుందని చెప్పినాను.

బాలి:- పగడండీ! నీవు యిక్కడనుంచి వెళ్ళిపోవుచున్నావు. మరల నీవెప్పటికిని తిరిగిరావద్దు. నీవు వెళ్ళక ముందే నేను నీతో నామనసులోనిమాట - ఒక చిరపరిచిత మాట చెప్పెదను. అయితే వింటావా?

పగడండిహృదయంలో ఆ సమయమున రెండు ధారలు ప్రవహించుచున్నవి. ఒకటి సంశయము మరిరెండవది విస్మయము. కాని సంశయము కంటే అధికము నాకు విస్మయము మాత్రము ఉన్నది. తన యుత్సాహము అణగద్రొక్కుకొని "చెప్పు" యడిగింది.

బాలి:- నేనధికముగా చెప్పను. కేవలము రెండు మాటలు మాత్రము చెప్పెదను. నేను నీతో ఎప్పుడును ఏమి చెప్పలేదు. దానికి కారణమేమిటంటే యిప్పటివరకు చెప్పు సమయమురాలేదు. నీకిప్పుడు తెలియజెప్పు సమయము వచ్చినది. కనుకనే నేను చెప్పుచున్నాను.

కొద్ది సేపు ఆగి మరల తన స్వాభావిక దార్శనిక పద్ధతిలో ఆతడు చెప్పుట మొదలిడెను. మొదట మాటేమిటంటే "నీయందు అగాధమైన ప్రేమున్నప్పటికి కూడా నేటి వరకు నేను దాని నెందుకు బయట పెట్టలేదుయనెడిది నాకు గుర్తు యున్నది. సర్గంగావలె నీవు మొట్టమొదటగా ఈ మామిడితోపునందు ప్రవేశించినరోజునే నేనుదాదాను 'దాదా! ఈమె ఎవరు' అని అడిగినాను. దాదావినోదముగా నీ 'భార్య' అని చెప్పినాడు. నేను సిగ్గుపడినాను. అప్పటినుంచి నేటి వరకు ఒకయుగము గడచిపోయినది. ఎన్నో వసంత ఋతువులు వచ్చినవి. ఎన్నో వర్షములు కురిసినవి. మనమిద్దరము ఎన్నో కథలువిన్నాము. ఎన్నోపాటలు విని మరచిపోయినాము. మరిఎన్నోసార్లు మనమిద్దరము పరస్పరముగా జగడమాడినాము. ఈ అతీతమైన జీవితములో చిన్న చిన్న ఘటనలు గూడ స్మృతిపరదాల మీద అమర రేఖలాగా తయారై వ్రాయబడింది. మరి ఆ వంకరటింకర రేఖలను జోడించినచో తయారగు అక్షరమాలకు ఒకే అర్థము యిదే విధముగా ఉంటుంది. ఈ ఆమ్రవనములో ఒక సన్నని, చిన్నవి, పలుచనిదియైన ఒక పగడండియున్నది. ఆ పగడండి యొక్క ఉపేక్షిత జీవిత సారాంశ మేమన - అది ఏయుగాంది కాదు. ఈ అనంత విశాల లోకానికి పగడండి ప్రకాశవంతముగ కాగలదు. అది యుండక పోయినను దానిగాథ యుగ యుగముల వరకు కల్పనాలోక విస్తృతాకాశములో స్త్రీత్వానికి ఆదర్శమై నభోమార్గమున నక్షత్రమై మిలమిలా మెరయుచుండును. అయినప్పటికీ నేను నీతో ఎప్పుడూ ఏమిచెప్పలేదు. తెలుసా!

ఇంతే కాకుండా నేటివరకు నీ యెడల కేవలము ఔదాసీన్య కఠోరయుక్తి భావములను మాత్రమే

ప్రదర్శించినాను. నీరస ఉపేక్ష ఆలోచనాత్మక వినోదము కంటె ఎక్కువ జ్ఞాపకము లేదు. నేనింకా నీకేమైనా యివ్వగలుగుదునో లేదో కాని-ఎందుకు? దీనికొక కారణము కలదు.

పగడండీ నేను నిన్ను ఎరుగుదును. నేను నీ హృదయమును బాగుగా గుర్తించినాను. నేను నీ జీవితపు దార్శనిక అధ్యయనము చేయుచున్నాను. ప్రపంచకల్యాణార్థం ఏదో ఒక అభిప్రాయమును తీసుకొని నీ జీవితం నిర్మాణ మయ్యెనని నేనెరుగుదును. ఏ లక్ష్యమును స్వీకరించి విశ్వపు రచనాత్మక శక్తి నిన్ను స్వరమునుండి తెచ్చి ఈ మామిడితోపు గడ్డి, మరి ఆకుఅలములతో తయారైన శయనంమీద పరుండ బెట్టినది నేనెరుగుదును. నీ జన్మయందు ఏ అంతర్నిహిత లక్ష్యమునకై ఏ మార్గమును నీవు అనుసరించి అధికఫలప్రాప్తి పొందగలుగుదువో నాకు తెలుసు

ఏ గొప్ప మహా ఉద్దేశము కొరకు నీవు జన్మించినావో దానిని నేనెరుగుదును. సహాయము చేయవలె. అవును. ఒక్కటి మాత్రము చేయగలుదును. గాయకుడు తన స్వరము ఆరోహ అవరోహణల మధ్యలో నాట్యము చేయుచూ తీసుక వెళ్ళి తాళ రాగాను సారము స్వరమును నిలుపుతాడు. వినే వారు అతనికి సహాయము చేయలేరు. కాని మరల చివరికి తాళరాగానుసారము స్వరము నిలిపినప్పుడు ఒక పర్యాయము తల ఊపెదరు. తాళము యింటికి వచ్చినమీదట అందరు తలలు ఊపేదరు. తిరిగి పగడండి! నీ జీవితపు ఉచ్చాదర్శములను నీవు ఒంటరిగానే కాపాడవలయును. నీజీతపుతాళము తిరిగి యింటికి వచ్చిన రోజున ఆ సంగీతములో నన్ను నేను మరచి తల ఊపెదను. నేను యింతకన్నా ఎక్కువ సహాయము చేయలేను. నీవురాగ తాళానుసారముగా నీ జీవితమును కలపనప్పుడు నేనే నీకు సహకారినగుదును యింతే పగడండీ!

ప్రేమవలన స్వర్గము లభించును. కాని దానికంటె విలువైన ఉజ్వలమైన మరియొక సాధనము సేవ. యిప్పుడు నీవు అవలంభించిన పుణ్యమార్గాన్నే సేవాపథమును అందరు ప్రేమించగలరు. కాని అందరు సేవ చేయలేరు. ప్రేమించుట మానవ స్వభావము. కాని సేవ ఒక సాధన. ప్రేమ కోమల హృదయ జన్య సునీత భావపరంపరల సంగ్రహ సాధనము. కాని సేవ ఆ కోమల భావముల సారప్రసారము. ప్రేమలో స్వయముగా లక్ష్యమై యితరులకు ఒకలక్ష్యమాతాడు. కాని సేవలో తానే ఒక సాధనమై ప్రపంచమును, తన సాధనలకు తపోభూమిగా చేయవచ్చును. ప్రేమ యజ్ఞము లాంటిది. కాని సేవ తపస్సులాంటిది. ప్రేమ ప్రయత్నంచే ప్రియాప్రియుల సంయోగదశ సంభవిస్తూ ఉంటుంది. కాని సేవాపరాయణత చేత భగవంతుడు ప్రాప్తిస్తాడు.

నీవు జన్మించినదాది నేటివరకు తు. చ. తప్పకుండా అత్యాధునిక కాలములోగూడ ఆ సేవా మార్గమునే అనుసరించుచున్నాను. అనిర్విఘ్న ప్రగతీరథానికి ఎప్పుడైనా విధివశాత్తు ప్రేమ ఒక విఘ్న పిశాచమై వస్తే ప్రయత్న పూర్వకంగా దాన్ని వెడలగొట్టు.

ప్రేమ మానవ గుణసూచకము. సేవ దైవీగుణ సూచకము. ఆత్మశరీరద్వం ద్వం ప్రపంచపు అమర గాథ. ఈ శరీరము భౌతికమైనప్పటికి ఆత్మదైవికమైనది. శరీరము మరియు ఆత్మలో కల్గిన ఆధ్యాత్మిక భౌతిక విషయ ద్వంద్వమే ప్రపంచంలో అనాది కాలంనుండి చెలరేగుతున్న జటిల సమస్య. వసంత ఋతువులో చెట్లు చిగిర్చి పూవులు పూయును. ఆ పువ్వ వనాలలోనుండి భృంగాల సమూహము మధుర మధువును గ్రోలి ఆనంద పరవశతయొంది యదోగాన మొనరించునట్లు ఝుంకారము చేయును. వసంత రాజాని మధుపాత్ర సర్వజనాకర్షణీయము. ఆ ఋతు ఆగమనంచే ఆత్మ పుష్పాల్లోగూడ ప్రాతః కాలమున స్వప్నము లాంటి జలకణములు పడుతాయి. సామ వేదపు మధుర గంభీర ధ్వనిలో మేఘములారుని మదించిన కరతాళ ధ్వనులు ప్రతిధ్వనించినపుడు

కైలాసములో వసంతము వచ్చును. యిదియొక ప్రాచీనగాథ. యుగయుగములనుండి యిదేవిధముగా జరుగుచూ వచ్చుచున్నది. మరల అందరు దీనిని మరచి పోవుదురు. నేత్రములు అర్థనిమీలిత మవుతాయి. తపస్సుయొక్క శుభ్రమైన ప్రత్యూషములో అనురాగపు అరుణ ఉష టపటపమను చూపడును. సాధన రూపమైన హిమ బిందువులు మిలమిలలాడుతాయి. వాత్సల్యము చెరపబడుతుంది. హృదయపు ఏకాంతంలో ఎవరిదో ప్రతిబింబము జొరబడుతుంది. జాగరూకత ఆవలింతలతో సరిపోతుంది. స్వప్నములలో మత్తు లీనమై పోతుంది.........మరి మరి కళ్ళు తెరువబడినాక ఎక్కడనూ యుండదు. మరల కొత్త కథ ప్రారంభమగును. క్రొత్త యాత్ర చేయవలసి వస్తుంది. కొత్త ప్రస్థానమగును. ప్రపంచం యిదే విధంగా నడుస్తుంది.

ఆత్మమీద దేహపు ప్రభావము సంశయమొక్కటియే. ప్రపంచములో అందరూ ఎవరినో ఒకరిని ప్రేమించుతుందురు. అప్పుడు మరల నేను - కేవలము నేను మాత్రమే ఎందుకు వీరితో వంచితుడుగాయుందును. యిది జీవితపు జటిల సమస్య. శాశ్వతంగా యుండెడి ప్రశ్న.

కాని సత్యమన నేమియనునది ప్రజలు తెలుసుకొనుట కెక్కువ ప్రయత్నము చేయరు. కాళ్లుఉన్నవారు భూమిమీద నడచుట సహజము. కాని రెక్కలుగల్గినవారుగూడా నేలమీద నడచుట తమ శక్తి నిరుపయోగముచేయుట. తన మహత్తర శక్తిని సదుపయోగ మొనరించకపోవుటయే తనను తాను మరచుట.

ప్రేమించే యోగ్యత అందరకూగలదు. కాని సేవచేసే యోగ్యత కొద్దిమందికి మాత్రమే లభిస్తుంది. ఆ యోగ్యతగలిగియుండుట దండన కాదు, భగవంతుని ఆశీర్వాదము. ప్రపంచంలో ఒక వ్యక్తి నిస్సహాయుడూ, ధనహీనుడూఅయి, దుఃఖంలో ఓదార్చే ఔదార్యవంతులు సుఖంలో ఆనందంతో హృదయానికి ఆనందం చేకూర్చేవారు లేక బాధపడుతున్నాడంటే భగవంతుని కాతనిమీద విశేషమైన కృప ఉన్నదని అర్థం. యింత నిస్సహాయుడే సేవాపరాయణుడవగల్గుతాడు.

పగడండీ నీవు ఈశ్వరుని రచనా ప్రణాళికలో ఒక రచనవు. నీ లక్ష్యం సేవాలక్ష్యం. అన్యులకై జీవితయాత్రచేయుట అన్యులకై ప్రాణార్పణ ఒనరించుటయే జీవితసార్థకతయని గుర్తెరుంగుము. నీవీ పృథ్విమీద మహా ఉద్దేశ్యముతో వచ్చినావు. జ్యేష్ఠ మాసపు వడగాలిలో భాద్రపదమాసపు నిరంతర వర్షంలో మరి శిశిరఋతు తుషారపాతములో యిదే విధంగా పరుండి అసంఖ్యా మానవుల రాకపోకలకు సహాయకజీవివై బ్రదుకుము. సభ్యతా వికాసముకొరకు జీవితసౌఖ్యముకొరకు మానవజాతికి మంగళకరమైన వస్తువును చేకూర్చే నిమిత్తం మహా త్యాగమును నీవు చేయవలెను. నీవు నాకెవ్వరు లేరని భావించుచున్నావు. కాని అందరు నీవారే. నీవు ఒక వ్యక్తినిగాని సంఘమునకుగాని లోనైజీవింప వలసిన దానవుగాదు. ఈ అనంత సృష్టిలో దిగ్దిగంతములవరకు కనిపించు సమస్త మానవజాతికి ఆత్మబంధువై జీవింపుము. నీవు విశ్వపు అక్షయ విభూతివి.

యింతకు ముందెపుడు నేను నీతో ఏమీచెప్ప లేదు. కారణమేమిటంటే పగడండి నా స్పష్టవాదితను క్షమించు. నీ ఆత్మ నిదురించుచుండెడిది. కేవలము నీ కొరకు మేల్కొనియున్నది. నీవు ఎవరివో ఎందుకై వచ్చినావో తెలిసికొనకుండా నీవు ప్రాచీన పంథామీదనే నడవగోరితివి కాని నేడు ఏ కారణమువనో వర్తమాన జీవితములో నీవు నిన్నే అసహ్యించుకొనుచున్నావు. నేడు నీవీ అనంతములో దూకబోవుచున్నావు. ప్రపంచమునకు ఏదో చేయుటకు వెళ్లుచున్నావు. నీ ఆత్మ మేల్కొంచినది. యీ మాటలను చెప్పటకు నేడే అవకాశము లభించెను.

పగడండి నేను నీస్నేహము చేయుటలేదని భావింపవచ్చు. నేను నిన్ను ప్రేమించుచున్నాను, ప్రేమించుటేగాక దేవతవని తలంచి పూజించుచున్నాను.

(సశేషము)

—(౦)—




# బాలల లైబ్రరీ

శ్రీ చక్రవర్తి రంగస్వామి

బిడ్డ

లైబ్రరి అంటే ఏమిటి నాన్నా?
వస్తానీతో చూస్తానేమూ
పోదాంపద లేలే రా నాన్నా!

తండ్రి

అట్టమీద బంగారపు అక్షరాల పుస్తకాలు
అందమైన జరీ అంచు పుస్తకాలు
పెద్ద పెద్ద అక్షరాల అందమైన పుస్తకాలు
బరువులేని తేలికైన పుస్తకాలు -
పలువన్నెల పటములతో
పలురంగుల బొమ్మలతో
ముచ్చటైన పుస్తకాలు
ముద్దులొలుకు పుస్తకాలు
ఉంటా యిక్కడ!!

బిడ్డ

'లక్క పిడతలూ' 'జాబిలిపాటలు'
'లటుకు చిటుకులూ' 'నవ్వుపువ్వులూ'
'బొమ్మరిల్లు' 'చందమామ'
యింకా యింకా 'మిఠాయి చెట్టూ'
'బాల'లు కూడా ఉంటాయా అక్కడ?

తండ్రి

ఉంటాయమ్మా ఉంటాయి -
కమ్మ కమ్మనీ కథలుంటాయి
తియ్యతియ్యనీ పాటలుకూడా
పురాణకథలూ, బొమ్మలకథలూ
వీరుల కథలూ, జీవితకథలూ
ఎన్నో ఎన్నో పుస్తకాలు
పిల్లలకూ పుస్తకాలు!!

బిడ్డ

ఇంకా...యింకా...ఏముంటాయి?

తండ్రి

గుండ్రనైన మేజాలు
ఎత్తులేని తలుపు లేని బీరువాలు
చిన్న చిన్న కుర్చీలు —
లైబ్రరీని ఆనుకొని
పూలతోట, ఆటస్థలము
వింత వింత లెన్నో యెన్నో
వేడుకలూ ఉంటాయి!!

బిడ్డ

చదువులతల్లీ కాపురముండే

చక్కని యిల్లా లైబ్రరి అంటే!
వస్తానీతో, నేనూ చూస్తా
లే లే, పోదాంపద, రా, నాన్నా!!

తండ్రి
చదువుల తల్లీ కాపురముండే
చక్కని యిల్లే లైబ్రరి అంటే॥
పోదాంపద; రా, రా, అమ్మణ్ణీ

—(౧)—

# విజయ - భారతి

విశాల రాజ్యమును హేమచంద్రుడను రాజు పాలించుచుండెను. అతని భార్య సుగుణ. పేరుకు తగిన ప్రవర్తనకలది. భర్త అడుగు జాడలలో నడచుచు రాచకార్యములయందు తనకు తోచిన సలహాల నిచ్చుచు, మిక్కిలి తెలివిగా సంచరించునది. హేమచంద్రుడు కూడ ప్రజల మనస్సులను బాగుగా నవగాహన చేసుకొని పాలించెడివాడు. ఇన్ని రాజ భోగములున్నప్పటికీ వారికి సంతాన చింత తప్పలేదు. అందుకని అనేక వ్రతములు చేశారు. దేశమునగల పుణ్యక్షేత్రములనన్నింటినీ దర్శించివచ్చారు. అన్నదాన సంతర్పణ వస్త్ర బహూకరణ యిత్యాది పుణ్య కార్యముల నెన్నిటినో చేశారు, కాని ప్రయోజనములేకపోయింది. రాజు కూడ ముసలిదశకు వచ్చాడు. తనతరువాత రాజ్యము పాలించు కొడుకులేడే అని హేమచంద్రునిబాధ. ఎత్తుకొని ముద్దాడుటకు ఒక పసిబిడ్డఐనా లేడే అని సుగు వేదన.

సరే యిలా కాదని ఒక రోజున రాజ్యవ్యవహారములను మంత్రి చేతులకు ఒప్పగించి అడవులకు ప్రయాణమయ్యాడు. అలా అడవిలో పోతూండగా ఒకముని ఆశ్రమం అగుపించింది. రాజువెంటనే ఆశ్రమము దగ్గరకువచ్చాడు. అక్కడ ఒక ముని తపస్సులో మునిగి వున్నాడు. చేతులు జోడించి ముని ఎదుట నిలబడ్డాడు. కొంతసేపటికి ముని కళ్లు తెరచి చూచి, "ఏవరునీవని" అడిగాడు. రాజు వినమ్రుడై సర్వ వృత్తాంతము కళ్లనీళ్లతో విశదీకరించి ఎలాగైనా సంతాన సఫలతను కలిగింపుమని కోరాడు. ముని ఒక్క సెకండు కళ్లుమూసి మరుక్షణమే చిరునవ్వునవ్వాడు. "నాయనా! నీ విషయమంతా తెలుసు. కాని దైవ గతి దాటటం మనకు తరంకాదుకదా!" అన్నాడు. రాజు వెంటనే భయపడి సంగతేమిటో విశదీకరించమని కోరాడు. ముని యిలా చెప్పటం సాగించాడు. - "నీవు క్రిందటి జన్మలో అక్షేపణ రాజ్యాధిపతివి. ని పేరు చండసింహుడు. బహు క్రూరుడవు. విచారణలేకండా శిక్షలు విధించేవాడివి. నిర్దాక్షిణ్యంగా చిన్న చిన్న రాజ్యాలను కబళించేవాడివి. అదేమిటని ఎవరన్నా అడిగితే శిరచ్ఛేదన చేసేవాడివి. ఇలావుండగా ఒకసారి మాళవ దేశంపై పడింది నీకన్ను. ఆపట్టణ రాజు సుబుద్ధి. చాల ఉత్తముడు. అకారణంగా నీవు ప్రకటించిన యుద్ధమును చూచి ఆశ్చర్యపోయాడు సుబుద్ధి. సుబుద్ధి వెన్ను జూపు గుణము లేనివాడగుటచే రంగంలోకి దిగాడు. సుబుద్ధి సైన్యం చాల చిన్నదగుటచే చండసింహుని దెబ్బలకు తట్టుకోలేక పోయింది. అయినా ధైర్యంతో పోరాడినాడు. కాని దురదృష్ట వశాత్తు సుబుద్ధి మరణించాడు. సైన్యం చెల్లాచెదరయింది. వెంటనే క్రూరసింహుడు జయ జయనినాదాలు చేస్తూ పట్టణంలోకి ప్రవేశించాడు. అప్పుడు సుబుద్ధి భార్య భర్త మరణవిషయం విని తన ఏకైక పుత్రుని రక్షించుకొనుట ఎలాగాఅని తత్తరపడసాగింది. కాని ఆమెకు నమ్మకమైన ఒక సేవకుని ద్వారా కొడుకుతో సహా బయటపడింది. కాని ఆమె అంతఃపురందాటి పోతుండగా ఒక బలమైన చెయ్యి కొడుకును లాక్కుంది. భయంతో వెనుదిరిగిచూసింది. క్రూరసింహుడు నిప్పులు కళ్లవెంట వర్షిస్తూ నిలు

చున్నాడు. కుర్రవాడిని తీసుకువెళ్దామనుకొంటున్నావేం? జాగ్రత్త. ఈ వంశాంకురం దక్కటానికే వీలులేదు. అన్నాడు గర్జిస్తూ.

ఆమె హడలి పోయింది. చండసింహుని పాదాలపై పడి వేడుకుంది. గుండెలు పగిలేలా ఏడిచింది తన బిడ్డని రక్షించమని. 'వదలిపెట్టండి. వాడికి రాజ్యమూ వద్దు ఏమీ వద్దు. రాయిగాయిలా బ్రతుకుతాడు. చంపకండి. ఒక్కగా నొక్కడు. భర్తను పొట్టపెట్టుకొన్నారు. ఈ పసికూన ఏం చేశాడు.' అని విలపించింది. కాని చండసింహుడు కరకురాతి హృదయంతో బిడ్డడిని కత్తికిబలిచేశాడు. ఆమె గుండెలు పగిలేలా ఏడుస్తూ 'దుర్మార్గుడా! అకారణంగా నా బిడ్డను పొట్టపెట్టుకున్నావ్. ఈ పసివానిని చంపిన దోషం తప్పక కొట్టితీరుతుంది. ఇది బిడ్డడిని పోగొట్టుకొని గుండెపగిలి ఏడుస్తున్న మాతృశాపము. ఏ నాటికయినా యీ శాపం కొట్టి తీరుతుంది. -' అని విలపించి కత్తితో పొడుచుకొని చనిపోయింది. ఆనాటి అబలశాపమే నీకీ జన్మలో కొట్టితీరింది." అని ముగించాడుముని.

హేమచంద్రుని కళ్ల వెంట జలజలా నీళ్లురాలినై.

"స్వామీ! క్షమించరాని పాపంచేశాను - నాకు ముక్తిలేదా" అన్నాడు దుఃఖకంఠంతో.

"మానవులు పాపం సులభంగా చేస్తారు. తీరా ఆ పాపఫలితం అనుభవింపవలసి వచ్చినపుడు అయ్యో" అంటారు అన్నాడుముని.

"అయితే నాకు ముక్తిలేదా స్వామీ?" అన్నాడు.

ముని వెంటనే తను కూర్చున్న మామిడివృక్షం క్రిందనుండి లేచాడు కొంచెం జలాన్ని మామిడిఫలంపై చల్లాడు. ఆఫలం తక్షణమే పరిపక్వదశచెంది లోడిమవూడింది కాని, ఆశ్చర్యంగా మధ్య నిరాధారంగా నిలబడింది రాజు చేతిలో పడకుండా. రాజు వింతపోయాడు.

ముని చిరునవ్వు నవ్వుతూ అన్నాడు - "నీవు పూర్వ జన్మలో చేసిన పాపమంతా చేరి ఆ పండు నీ చేతిలో పడకుండా చేసింది."

రాజు ముని కాళ్లమీదపడి ఎలాగైనా తనను ఆపాపంనుండి విముక్తుని చేయవలసిందని ప్రాధేయపడ్డాడు.

రాజు విచారముఖాన్ని చూసేసరికి ముని హృదయం నీరయింది. వెంటనే తాను సంపాదించుకున్న తపఃఫలంలో కొంత భాగాన్ని వినియోగించి పండును ఆశ్రయించిన పాపాన్ని పారద్రోలాడు. వెంటనే ఆ మామిడిపండు సరాసరివచ్చి రాజు దోసిలిలో పడింది. రాజు ఆ పండును కళ్ళకుఅద్దుకొని మునికి నమస్కరించాడు. "వెళ్లి నీ భార్యకియ్యి. నీకోరిక ఫలిస్తుంది" అన్నాడు ముని. తరువాత హేమచంద్రుడు మునివద్ద సెలవు తీసుకుని రాజధానికి వచ్చాడు. భార్య జరిగిన విషయమంతా తెలుసుకొని ఫలమహత్తును విన్నతర్వాత ఎంతో సంబరపడింది.

కొంతకాలమయిన తర్వాత మహారాణికి చక్కని మగబిడ్డ కలిగాడు. అందాలు చిందే ఆ ముద్దు ముఖాన్ని చూచి ఎంతగానో మురిసిపోయారు తలీ తండ్రీనూ. అందాలు చిందే ఆ బాలునకు "మకరంద్" అని పేరు పెట్టుకున్నారు. మకరంద్ శుక్లపక్ష చంద్రునివలె పెరుగుతూ తలిదండ్రులకు మురిపెం కూర్చేవాడు.

బాల్యంగడిచి యౌవనంలోకి అడుగుపెట్టాడు. రాజవిద్యలన్నిటిలోనూ ఆరితేరాడు. వెంటనే మకరంద్‌కు వివాహము చేసి రాజ్యభారము కుమారునకు అప్పగించవలెనని నిశ్చయించుకొన్నారు. రాజకుమార్తెల చిత్రపటముల నేకములు మకరంద్‌నకు చూపించారు. కాని మకరంద్ యిప్పుడు వివాహము చేసుకోనని అన్నాడు. తను యింకనూ దూరదేశములకు వెళ్లి నూతన విద్యల నేకములు అభ్యసించి, యితర దేశములలోని క్రొత్త క్రొత్త విషయములు తెలుసుకొని రావలెననియెడి కోరిక యున్నదన్నాడు. కాని తలిదండ్రులు లేకలేక కలిగిన ఏక సంతానాన్ని విడిచి యుండుటకు ఒప్పుకొనలేదు.

(సశేషము)

కానాదిభొట్ల సుబ్బారావు

# తెల్ల రోజా!

| రచయిత్రి : | అనువాదము : |
| --- | --- |
| ఇన్‌గే షోల్స్ | డాక్టరు వి. ఎస్. శర్మ |

(గతసంచిక తరువాయి)

అలా పరిచయ భాగ్యాన్ని సంపాదించుకొన్న విద్యార్థులలో హాన్స్‌కి ఎంతోనచ్చింది అలెగ్జాండర్ అనే అబ్బాయి. అలెగ్జాండర్ నాన్న మ్యూనిచ్ నగరంలోనే పేరు ప్రఖ్యాతులుగాంచిన వైద్య శిఖామణి. ఆ అబ్బాయి హాన్స్‌కిమల్లె మితభాషి. ఉన్న తాశయాలు, ఉన్నతాదర్శాలుగల యువకుడు. వాళ్లని అసలు ఈ దేశంకాదు. విప్లవం ప్రారంభమవటానికి పూర్వం వాళ్ల నాన్న రష్యా దేశంలో పెద్ద ప్రాక్టీసుగల డాక్టరు. విప్లవ తాండవానికి ఆగలేకపోయాడు. భార్యా బిడ్డలతో ఆ రోజుల్లో ఈ దేశానికి వలసవచ్చి ఇక్కడే చిరస్థాయిగా నిలిచిపోయాడు. అలెగ్జాండర్‌కి కష్టాల్ని అనుభవించే వారినిచూస్తే ఎంతో జాలి. ఆ కష్టాలనుంచి గట్టెక్కించటానికి శక్త్యానుసారం సహాయంచేయాలి. అలా చేస్తేనేగాని ఆ అబ్బాయి మనస్సు కుదటబడేదికాదు. హిట్లరు యువక బృందంలో ఇతడూ ప్రారంభదినాల్లో ఎంతో వుత్సాహంతో పనిచేసినవాడే. హాన్స్‌కి మల్లె బాలసంఘపు నాయకుల నిరంకుశత్వపు తత్త్వాన్ని ప్రతిఘటించి దెబ్బలుతిన్న ధీరుడే అలెగ్జాండర్. అంచేత ఇద్దరి మనస్సులు కలిశాయి. ఏకోదరులు అని వీరి నిద్దరిని పేర్కొన్నా తప్పేమిలేదు.

అలెగ్జాండరు మూలాన విద్యార్థుల శ్రేణిలోనుంచి హాన్స్‌కి మరో మిత్రుణ్ణి సంపాదించుకొనే భాగ్యంకూడా లభించింది. ఈ కొత్త స్నేహితుని పేరు క్రిస్టల్. క్రిస్టల్ వయస్సులో హాన్స్‌కన్నా, . అలెగ్జాండరుకన్నా కొంచెం పెద్దవాడు. తత్త్వశాస్త్రము క్రిస్టల్ అభిమాన శాస్త్రము. తత్త్వశాస్త్రాన్ని క్షుణ్ణంగా అవగాహనంచేసుకొనడానికి క్రిస్టల్ చేసిన పరిశ్రమ ఇంతింతని చెప్పతరంగాదు. తత్త్వ శాస్త్రాన్ని చదివేవారికి ఈ లోకం సంగతి ఏమాత్రమూపట్టదని మనం అనుకొనటం సహజం. క్రిస్టల్ తత్త్వం అట్టిదికాదు. ఆ విద్యలోని తత్త్వాన్ని తన జీవితంలోనే ఆచరణలో పెట్టడానికి, ఇతరులలో అట్టి దివ్యతేజాన్ని చూసి ఆనందించటానికి క్రిస్టల్ ఏమాత్రం వెనుకంజవేసేవాడుకాదు. జర్మను సనాతన సాంప్రదాయానికి సంబంధించిన కుటుంబంలో పుట్టి పెరిగినవాడు. క్రిస్టల్ తండ్రీ తత్త్వశాస్త్రంలో నిధి. తండ్రి అంటే క్రిస్టలుకి చెప్పరానంత భక్తి, గౌరవం. తత్త్వశాస్త్రాన్ని ఇట్టి వున్నత దృష్టితో అవగాహనం చేసుకొని, లోక శాంతికి, లోక కల్యాణానికి అనుభూతిగా నుంచుకొనడానికి అవసరమైన సాధన సంపత్తినంతా తనకి ప్రసాదించినవారు తన నాన్నే అని క్రిస్టలు ఎప్పుడు అంటూవుండేవాడు. ఆ అబ్బాయికి పెళ్లి అయింది. ఇద్దరు బిడ్డలు. పెద్దబ్బాయికి మూడేళ్లు. చిన్నబ్బాయి వయస్సు రెండేళ్లు. జీవితంలో కష్టనిష్ఠూరాలు అనేవి ఏమిటో అతనికి బాగా తెలుసు. అంతేకాదు. వాటిలో ఎంతో అనుభవంకూడావుంది.

మరికొంతకాలానికి మరో విద్యార్థితో హాన్సుకి స్నేహభాగ్యం లభించింది. ఆ విద్యార్థి పేరువిల్లి. విల్లి అలెగ్జాండరు,క్రిస్టల్‌లకన్నా అందగాడు;విల్లీస్వదేశం సార్లాండు (హిట్లరుకాలంలో ఫ్రెంచివారి పాలనని ప్రతిఘటించి జర్మను రాష్ట్రంలో కలిసిపోయిన దక్షిణప్రాంతపు ఫ్రెంచిమండలం). విల్లి హాన్స్‌కి మల్లె మితభాషి. ఈ అబ్బాయిని చూశాడోలేదో, "ఈ

అబ్బాయి నా కోవకి చెందినవాడే" అని హాన్స్ అనుకొనేను. విల్లి అభిమాన శాస్త్రం తత్వ శాస్త్రం. ఆ శాస్త్రంలో ముఖ్యంగా కర్మ కాండ అంటే ఎంతో ఇష్టం. నా చెల్లి సోఫీకి విల్లితో పరిచయం అయ్యాక ఆ అబ్బాయిని గురించి సోఫీ ఇలా వర్ణించింది;

"అనవసరంగా మాట్లాడడం అనేది ఆ అబ్బాయికి ఏమాత్రమూ నచ్చేది కాదు. ఏ విషయాన్ని గురించి అయినా చర్చించదలచాడా, ఆ సంగతిని తృణ్ణంగా ఆలోచించనిదే వాదనకి దిగేవాడు కాదు. తను న్యాయమూ, సత్యమూ అనేదాన్ని ఆచరణలో పెట్టటానికి ఏమాత్రమూ తటపటాయించేవాడు కాదు విల్లి. అతని మాటలు ముక్తసరి తూచాగా వుండేవి. ఇక వాటిని కార్యరూపాన పెట్టడానికి దిగాడా, వాటిని నిర్విఘ్నంగా కొనసాగించేటంతవరకు వూరక వుండే ఘటము కాదు విల్లీది."

విల్లీ నాన్న పెద్ద వర్తకుడు. చిన్న నాటినుంచి ఆ అబ్బాయి తనకి నచ్చిన త్రోవలోనే నడవటానికి సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని తండ్రి ఇచ్చాడు. క్యాతలిక సాంప్రదాయాల్లో ఆ ప్రాంతపు వారికి మల్లె పుట్టి పెరిగినవాడు విల్లీ కూడా. హిట్లరు బాల భటవర్గంలో విల్లీ ప్రారంభపు రోజుల్లో ఎంతో వుత్సాహంతో పనిచేశాడు. ఆ ఉద్యమం పెడ మార్గాల్లో నడవడం చూశాక దానిని ప్రతిఘటించటానికి శాయశక్తులా ప్రయత్నించాడు. హాన్స్‌కి మల్లె కొంతకాలం కారాగారపు శిక్షను కూడా అనుభవించాలసివచ్చింది. అలగ్జాండర్, క్రిస్టల్, హాన్స్‌లకి విల్లి ప్రాణస్నేహితుడయ్యాడు. తన అభిమాన శాస్త్రం తత్వశాస్త్రం అయినా, వైద్య శాస్త్రాన్ని చదివి డాక్టరు పట్టం పొందాలని విల్లి మ్యూనిచ్ విశ్వవిద్యాలయానికి అంత దూరప్రదేశాన్నుంచి ఇక్కడికి వచ్చాడు.

ఎట్టి అవకాశం దొరికినా ఈ మిత్రులు నలుగురూ ఎక్కడో ఒక చోట తరుచుగా కలుసుకుంటూ వుండేవారు. అలా కలుసుకొన్నారా వాళ్లు చెప్పుకోవాలసిన కబుర్లు ఎన్నో వుండేవి. అలా చెప్పుకొనే కబుర్లు ఆ నాటి దేశపరిస్థితులను గురించేగా! అవీ సామాన్యమైనవా? కనీ వినని కథలూ, గాథలూ ఎన్నో ఆ రోజుల్లో జరిగిపోతూ వున్నాయి. రేడియోలో వాటిని గురించి వినటానికి అవకాశం లేకపోయినా, వార్తాపత్రికల్లో ఆ విషయాన్ని గురించి చదివే అదృష్ట భాగ్యం లేకపోయినా, ప్రజాకోటికి ఆ ఉదంతాలన్నీ తూచాగా తెలుసు. ఒకరిద్దరు ఎక్కడ సమావేశమవటానికి వీలుగలిగినా, అట్టి సమయాల్లో వాళ్లు వాళ్ల వాళ్ల పరిభాషల్లో చర్చించుకొనేది అట్టి సంఘటనల్నిగురించేగా! అట్టి పరిస్థితుల్లో ఇక విద్యార్థుల వుద్రేకం, వుత్సాహం చెప్పటం అవసరం కాదు గామః? అందు ముఖ్యంగా ఇట్టి విషాదఘట్టాల్ని అంతకు ముందే ఎదుర్కొని బాధపడ్డ విద్యార్థులు, ఈ రోజుల్లో, దేశపరిస్థితులు విషమించాక, తద్వారా దేశము, ప్రజా-అంతేనా-జాతికీర్తి ప్రతిష్ఠలూ తారుమారయిపోతూవున్న ఈ రోజుల్లో-మనకెందుకు వచ్చింది యీ బాదరబందీ అని ఎలా వూరకుండగలుగుతారు?

ధైర్యవంతులు, సాహసవంతులు దేశంలో అన్ని చోట్లా ఈ వుప్పెననుంచి ప్రజాకోటిని గట్టెక్కించటానికి శతవిధాల ప్రయత్నించటం ఈ విద్యార్థులకు చక్కగా తెలుసు. ఆ మహనీయులు ప్రాణానికి సైతం తెగించి అన్నిచోట్లా గుప్తంగా పంచిపెట్టుతూ వున్న కరపత్రాల్ని ఈ విద్యార్థులు చూసే వున్నారు. అందలి విషాదగాథల్ని నెమరు వేస్తూ, ఆ మహనీయులకి ఏరూపాన సహాయంచేస్తే మంచిదా అనే సంగతిని అణు మాత్రం మరచినవారు కారు.

హాన్స్, అలెగ్జాండర్, క్రిస్టల్, విల్లీ ఎక్కడ కలుసుకున్నా వారిని కలవరబెట్టే సమస్య ఇదేగా! దాన్ని ఎలా తేల్చాలి అనే విషయాన్నే వారు ఆ సమావేశాల్లో ఎప్పుడూ ఆలోచించేది!

(సశేషము)

# స్మృతిపథం

శ్రీ కావుటూరు వేంకటనారాయణరావు



యేమౌతానో! నేనేమౌతానో!
నీలాల నింగిలో ధృవతారనౌతానో!
తారలలో మెరిసే చంద్రుడినౌతానో!
యేమౌతానో! నేనేమౌతానో!
ప్రశాంత పున్నమ వెన్నెలలో
చెలియలి కట్టను చెలిమిచేయగోరే
ఉత్తుంగ తరంగ పంక్తి నౌతానో!
గభీరజలధిలో, నిశీథ చీకటిలో
వ్యధిత హృదయనావకు నావికుడనౌతానో!

యేమౌతానో నేనేమౌతానో!
నందన వనమందార మధువుత్రాగే
ఎలతుమ్మెదనౌతానో!
వసంత ఋతువున విశాల జగతికి
వింత వింత రీతుల
విన్యాసాలతో విరహగీతిని పాడే
మావికొమ్మపై కోయిలనౌతానో!
యేమౌతానో! నేనేమౌతానో!



# తనతో తాను

శ్రీ 'విజయ - రాఘవ'

"చచ్చిపోయింది."

"ఎవరూ ?"

"జానకి చచ్చిపోయింది."

"చచ్చిపోయిందా !"

"అవును, జానకి వెధవ చావు చచ్చింది"

"వెధవ చావు చచ్చిందా !"

"వూరి బయట మోట బావిలోపడిచస్తే, వెధవ చావుగాక మరేమవుతుంది."

"జానకి చివరకు యిలా వెధవచావుని కోరుకొన్నదా !"

"ఏంచేస్తుంది ? చావక - యింకా నయం, అసలు యింట్లోనే దూలానికి వురివేసుకొని చద్దామని ప్రయత్నించింది. ఎందుకో ఆగిపోయి, తుదకు మోట బావికి దారి తీసింది."

"నాకేమో నమ్మకంగా లేదు సుమా !"

"యింకా చావలేదనా ?"

"జానకి యెంత మంచిపిల్ల. యిరవైయేళ్లుకూడా దాటలేదు. పట్టుమని పదిసంవత్సరాలుకూడా కాపురంచేయలేదు. సంసార సుఖం అనేదేమాత్రం పొందలేదు. అటువంటి జానకికి యిలాంటిచావు సంప్రాప్తించిందంటే, నాకెందుకో నమ్మకంకుదరటం లేదు."

"నాకుమాత్రం మొదట్లో అలా లేదంటావా ! చాలా సేపటివరకూ యెవరీమనిషన్నది గుర్తుకే రాలేదు. యెంతోసేపు ఆలోచించాను. యెక్కడో చూసినట్లు జ్ఞాపకం బుర్రలో మెదలడం మొదలు పెట్టింది. పరీక్షగా చూస్తూనే, నా కర్తవ్యం ప్రకారం నేను చికిత్సచేసాను. అప్పటికే వ్యక్తి యొక్క సహజ స్వరూపం, నీళ్లు త్రాగడంచేత పూర్తిగా మారిపోయింది. కాని, నా విధి నేను చేసిన తరువాత జానకి శవం వెళ్లిపోయింది. వెళ్లిన గంటదాకా యేదో సన్నిహితత్వం నా హృదయంలో మెలికలు తిరగటం మొదలుపెట్టింది. చివరకు 'జానకి' అనే నిర్ధారణచేసుకొన్నాను."

"ఈ కళ్ళతో యెన్నోసార్లు చూస్తూ జానకికి బ్రతికివున్నరోజుల్లో మందులిచ్చాను. ఆమెను చూస్తుంటే నాకేదో ఆమె రక్త సంబంధమైన వ్యక్తిగా భావనకల్గేది. అందరి రోగులకంటే, జానకిని ముందుగా చూసి, సరియైన మందుయిచ్చి, పంపేదాన్ని. ఆమె నవ్వుతుంటే తన కామె కానుకగా యిచ్చేది యీ లోకంలో ఆ నవ్వొక్కటేనేమో అనిపించేది."

"ఇప్పుడా జానకిని నువ్వూ, నేనూ యెంత స్మరించినా యేమిటి లాభం! చచ్చిపోయిన జానకి మళ్లా వస్తుందా చెప్పు! ఆమెలాగా నవ్వుతూ, నీ హృదయానికి ఆనందాన్ని యిచ్చేది యిక యెవ్వరూలేరని నువ్వు యెన్నిసార్లు అనుకొన్నా జానకి బ్రతికిరాలేదుగా !"

"జానకి నూతిలోపడి చచ్చిపోయినా, ఆమె సౌందర్యరూపం నా హృదయంలో అచ్చుగుద్దినట్లుగావుంది. ఆ చివర్నవ్వు నా హృదయాంతరాళంలో యింకా కిలకిలమని మసలుతూనేవుంది."

"జానకిని గురించి నాకు తరువాత, తరువాత తెలిసింది. ఎవరీ జానకి ? అనేది క్రమేపీ నాకున్న ప్రశ్న కరిగిపోయింది. జానకిలాంటి యువతులు యెంతమంది యీ లోకంలో అష్టకష్టాలనుభవించి, జీవితంమీద రోతపుట్టి, ఆత్మహత్యలకు గురిఅవుతున్నారో నీకు తెలియకపోలేదు. తెలిసినా వాటిని గురించివిని, యేదో కాసేపు సానుభూతిగా విచారపడటమే సంభవిస్తుందిగాని, పదేపదే తల్చుకొని, బాధపడటం జరగదు. జానకి విషయంలో అలా వుండలేం. ఆమె కన్నుల్లో నవవసంత వికస్వ

విచ్చుకొనేవి. ఆమె మాటలో తేనెవాకలూరి, ప్రవహించేవి. ఆమె నవ్వులో - ఆమె నడకలో - యేదో నాదం నినదించేది - జానకి జీవితం నన్ను కలచివేచినంతగా మరేదీ యింతవరకూ కలతపరచలేదు.

“జానకి బాగా ఆస్తిపాస్తులున్న జగన్నాథం యింట్లో పుట్టింది. చదువుకూడా ఒకమాదిరిగా నేర్చుకొంది. జగన్నాథానికి జానకి పెద్ద కూతురు అవటంతో, పెళ్లీడుకొచ్చేటప్పటికి, మంచి సంబంధం కోసం వెతకసాగాడు. చివరకు యెలాగైతేనేం, పాతికెకరాలభూమివున్న ఒక కుటుంబంలోని శ్రీనివాసరావుకి, జానకినియిచ్చి మహా వైభవంగా వివాహంచేసాడు.

శ్రీనివాసరావు, జానకియొక్క సౌందర్యానికి వెలకట్టలేక కట్నం - కానుకలు వొద్దని చెప్పాడు. శ్రీనివాసరావు తల్లిదండ్రులుకూడా పెద్దగా కట్నం గురించి పట్టించుకోక వూరుకుండిపోయారు.

కొన్నాళ్ళు రోజులు బాగానే దొర్లిపోయాయి. జానకి శ్రీనివాసరావుతో కాపురం చేయడానికి వచ్చింది. శ్రీనివాసరావు, తన జీవితమంతా జానకిదే అన్నట్లు భావించి, యెప్పుడూ ఆమెతో కాలక్షేపం చేస్తూండేవాడు. జానకివచ్చిన రెండో సంవత్సరంలో ఆ వూరికి కలరా అంటువ్యాధివచ్చి, శ్రీనివాసరావు తల్లిదండ్రుల్ని యేలోకాలకో తీసికొనిపోయింది. శ్రీనివాసరావు చాలా రోజులు, జీవితంమీద విరక్తిపుట్టి, దిగాలుపడుతూ అదోలా ప్రవర్తించుతూ, జానకితో యెక్కువగా కాలక్షేపం చేయకుండా వుంటూవుండేవాడు.

జానకి యెన్నోసార్లు శ్రీనివాసరావుని ఓదార్చింది. తాత్కాలికంగా శ్రీనివాసరావు వూరుకోగలేవాడు.

ఆ సంవత్సరం శ్రీనివాసరావు చేస్తున్న వ్యవసాయం కుంటుపడి, ఆదాయం తగ్గింది. ఆ సంవత్సరమే గొడ్లపాక తగులబడి రెండు పాడిగేదెలు, ఒక యెద్దు చచ్చిపోయాయి, ఆ దెబ్బతో శ్రీనివాసరావుకి తలతిరిగిపోయింది. సంసారమంటే విసుగు పుట్టింది. వున్నపొలంలో చాలావరకు అమ్మి తల్లిదండ్రులు చేసిన అప్పులు - తను చేసిన అప్పులు తీర్చాడు. పోతే ఒక్క యెకరం మాత్రం శ్రీనివాసరావు మొగంచూస్తూ వుండిపోయింది.

ఒకనాడు జానకికి తన కుటుంబ పరిస్థితి మరీ దారుణంగా కనిపించింది. యిదివరకటి మాదిరిగా శ్రీనివాసరావు యింటికిరావడంలేదు, పొలం పనులుమీద అశ్రద్ధ ప్రబలిపోయింది.

ఆ రోజు అర్ధరాత్రి దాటింది. శ్రీనివాసరావు, దగ్గరగా వేసివున్న యింటి తలుపుల్ని త్రోసుకొచ్చి, ప్రక్కనేవున్న మంచంమీద కుప్పలా కూలిపోయాడు.

అప్పుడే పడుతూ పడుతూవున్న నిద్రను పక్కకు త్రోసి జానకి చివాల్నలేచి, శ్రీనివాసరావు దగ్గర కొచ్చింది.

అతను మూల్గుతూ, చెరిగిన తలతో చెమటోడిన బట్టలతో, జిడ్డుగారుతున్న మొగంతో, వెలుగుతున్న చిమ్నీ వెలుగులో జానకికి భయంకరంగా కనిపించాడు.

మంచంక్రిందవున్న మంచినీళ్లు కాసిని మొగంమీదచల్లి - “ఏమండీ! అలా వున్నారు” అని మెల్లిగా అడిగింది.

శ్రీనివాసరావు యేమీ జవాబివ్వలేదు.

దగ్గరగా కూర్చొని, అతని మొగంమీదపడ్డజుట్టుని ప్రక్కకుతోస్తూ-

“ఏమండీ! మిమ్మల్నే! యేమిటలావున్నారు” అంది.

శ్రీనివాసరావుకి కొంచెం స్పృహవచ్చి కళ్లుతెరచి చూసాడు. జానకి, తనమీదకు వాలివుంది. దొడ్లో

తూచిన మల్లెపూవులు ఆమె తల్లో తెల్లగా నవ్వుతూ, మత్తుగొలిపే వాసనను వెదజల్లుతున్నాయి.

శ్రీనివాసరావు చటుక్కున లేచి, "అచ్చంగా భోగం పిల్లలాగా తయారయ్యావ్! యీ పూట యేమిటీ విశేషం?" అని కర్కశంగా అడిగాడు.

జానకి త్రుళ్ళిపడింది. అతని చూపుల్లో అగ్ని జ్వాలలు సెగలు చిమ్ముతున్నాయి. నోటినుండి దుర్గంధభూయిష్టమైన వాసనవచ్చి, శ్రీనివాసరావు చేసినపనిని తెలియపర్చింది.

జానకికి ఒక్కసారి ముచ్చెమటలు పోసినయి. ఏంమాట్లాడలేకపోయింది. దగ్గరగా జరిగి - "అన్నంతినరూ" - అంది.

"నువ్వుతిన్నావ్ గా! చాల్లే! నా కాకలిలేదు. కడుపునిండా కమ్మని మక్కువుంటే యింకా అన్నం దేనికి!" శ్రీనివాసరావు ముద్దుగా మాట్లాడుతూ, జానకిని కలవరపెట్టాడు.

జానకికి ఒక్కసారి గుండెలోంచి దుఃఖంపొర్లి వచ్చింది. "ఏమిటీపని" - అని అడగలేక పోయింది. స్నానం చేసివుతికిన బట్టలు కట్టుకో మని చెప్పడానికి కూడ జంకుపడింది.

ఆరాత్రి శ్రీనివాసరావు అలాగే నులకమంచం మీద పడుకొన్నాడు.

జానకికి మాత్రం నిద్రపట్టలేదు. యేదో విషయాన్ని పునశ్చరణ చేసుకొంటూ యేడ్వసాగింది. తల్లో మల్లె పూవులు, తలదిండు వొత్తిడికి వసివాడి, నలుపెక్కినయి.

ఆ సంవత్సరమంతా శ్రీనివాసరావు వల్ల హృదయానికి శాంతిలేక, యెవరుచెప్పలేక వూరుకుండి పోయింది. వున్న ఆ ఒక్క యెకరం అమ్మేసి, త్రాగుడికి, చీట్లపేకకి తగలేశాడు.

జానకికి శ్రీనివాసరావు పరిస్థితి భరించలేనంత ఘోరంగా కనిపించింది.

ఒకసారి శ్రీనివాసరావు ఒంటరిగా కూర్చొని, చుట్టకాలుస్తుండగా, జానకి దగ్గరగా వెళ్లి నిల్చొని, దీనంగా, సంసారాన్ని గురించి చెప్పటం మొదలెట్టింది.

శ్రీనివాసరావు విన్నట్లే విని, వుగ్రుడై, - "నీమూలంగానే నా జీవితమంతా నాశనమై పోయింది. తల్లి దండ్రులు నువ్వు పాదం పెట్టంగానే చచ్చిపోయారు. ఆస్తిఅంతా చెల్లాచెదరైంది. నా శరీరమంతా అనారోగ్యంతో తయారైంది. నువ్వు యేదో నన్ను బాగుచేస్తావుగదా! అని వూహించి పెళ్లి చేసుకొన్నా. కట్నంకానుకలు లేకుండా!" అని దెప్పి పొడిచి మాట్లాడాడు.

జానకి ఒక్కసారిగా పిడచకట్టుకొని పోయింది. యింతటి అభాండం తనమీద పడుతుందని యెన్నడూ వూహించలేదు. కట్నం కానుకలు తీసుకోక ఆదర్శవాదిగా వున్న శ్రీనివాసరావు చటుక్కున, తీసుకోవాలనే భావనకు దాసుడై పోయాడని గ్రహించింది. కుటుంబపరిస్థితియొక్క వాస్తవాన్ని తెలిసికొన్న జానకికి, శ్రీనివాసరావు కోరిక తేటతెల్లమైంది.

"పోనీ అలాగే మా నాన్ననడిగి కట్నం యిప్పించుతాన్లెండి" అంది.

జానకి ముఖంలోకి శ్రీనివాసరావు ఆదోలా చూస్తూ - "యిప్పుడివ్వకేం మీ నాన్న! అంత తెలివితక్కువవాడా! ఒకవేళయిస్తే నన్ను వెళ్లి తెచ్చుకోమంటావా! మొదట్లో వొద్దన్నవాడ్ని, యేమొగం పెట్టుకొనివెళ్లి, మళ్లా కట్నం తెచ్చుకోను... నీకు సిగ్గులేకపోతే, నాకులేదంటావా!" అని వుక్రోషంతో యెడా పెడా అనేసాడు, జానకి బిత్తరపోయింది.

"మిమ్మల్ని వెళ్లి తెచ్చుకోమంటానా! మీరు కావాలని అంటే నేనేవెళ్లి తెచ్చిపెడతా. మన కష్టాల్ని చెప్పుకొని యెలాగైనా తెస్తా. యివ్వనే వ్యక్తి కాదు కాబట్టి మా నాన్న తప్పకుండా

యిస్తాడు. నిజంగా తెమ్మంటారా!" జానకి అనునయంగా అడిగింది. శ్రీనివాసరావు, జానకిని పరీక్షగా చూస్తూ, "నేను కావాలని అనకపోతే, సంసారం సితిగతులు తెలిసినదానివి, కావాలో - అక్కర్లేదో నీకు తెలియదా! నీ యిష్టం వచ్చినట్లు చెయ్యి! నేనుమాత్రం కాదనను." అనిగోడమీద పిల్లి వాటంగా మాట్లాడాడు.

జానకి ఆ మాటకే తృప్తిపడి జగన్నాధానికి మర్నాడు కబురు పంపింది.

ఆ కబురువిన్న జగన్నాథం కంగారుపడి - కొంత సేపటికి తమాయించుకొని అయిదువందలు ప్రస్తుతానికి పంపాడు.

శ్రీనివాసరావు ఒక మాదిరిగా తృప్తిపడి "యింతేనా" అని జానకి మొగంలోకి చూసి, మూడువందలు తీసుకొని గబ్రాలా పాకలోకివెళ్లి చీట్లపేకలో తగలేసి, ఒక చుక్క వేసివచ్చాడు ఆ రాత్రి రెండు గంటలకి.

మిగతా రెండువందల్లో కొంతవరకు యింట్లో దినవెచ్చపుసరుకుల్ని కొన్నది జానకి.

మర్నాడు మళ్లా డబ్బుకావాలన్నాడు శ్రీనివాసరావు.

జానకి వెర్రిమొగంవేసి, మిగతాదికూడా చేతిలో పెట్టింది.

శ్రీనివాసరావు చివ్వునలేచిపోయి, ఓడిపోయిన రాజులాగా ఆ మర్నాడు ఒంటిగంటవేళ వచ్చాడు.

జానకి పెట్టిన అన్నం తిన్న తరువాత "మళ్లా! డబ్బుకావాలి" అనడిగాడు.

జానకికి ఆశ్చర్యం వేసి "నిన్న - మొన్న యిచ్చింది యేంచేసారు" అనడిగింది.

యిలా అడగడమే తప్పొచ్చింది శ్రీనివాసరావుకి.

ఆ పాళాన చడా మడా తిట్టాడు. జానకి రెండు మూడుసార్లు ఎదురు జవాబులిచ్చింది.

దానికి మహోగ్రుడై శ్రీనివాసరావు ఆమెను కొట్టాడు.

తీవ్రంగా కొట్టాడు. జానకి తాళుకోలేక యేడ్చింది.

రోజురోజుకి శ్రీనివాసరావు పోరు యెక్కువవటంతో, జానకి మనసు కల్లోలితమై, శరీరమంతా దెబ్బలకు గురవుతూవుండేది.

జగన్నాథానికి తన బాధను వ్యక్తంచేద్దామని కొన్నాళ్లు ప్రయత్నించింది.

కాని తనలో తానే యెందుకో భయపడి "మొగుడు కొడ్తే పుట్టింటి వారికి తెలియచేయడం చాలా తెలివితక్కువతన మనిపించుకొంటుందని" భావించుకొని శ్రీనివాసరావు చేసే ప్రతి కార్యానికి గురికాక తప్పటంలేదు.

శ్రీనివాసరావు శ్రుతిమించిరాగానపడి, మానవత్యం నశింపచేసుకొని, స్వార్ధపరుడై - జానకిని నానాహింసలు పెట్టసాగాడు.

జానకి వాటన్నిటికి తలవంచి అనుభవించసాగింది. ఒకనాడు శ్రీనివాసరావు విపరీతంగా పెచ్చరిల్లిపోయి, డబ్బు తెమ్మని గోలచేసాడు. జానకి చెప్పుకొంది -

"మా నాన్న దగ్గర ప్రస్తుతంలేదుట - కొన్నాళ్లాగిన తర్వాత పంపుతానన్నాడు." అని.

శ్రీనివాసరావు ఆ రోజున జానకి శరీరం రక్తం కక్కేటట్లు కొట్టాడు. యిదివరలో కొట్టిన దెబ్బలకి ఆస్పత్రిలో మందు వేయించుకొంటూ వుండేది. ఈ సారి తగిలిన దెబ్బలికి జానకి సిధిమిత హృదయం కదిలింది. గడిచిపోయిన రోజుల్లోని బాధల్ని తల్చుకొంది. బోరుబోరున యేడ్చింది. తన పెళ్లయిన కొత్త రోజుల్లోని మాధుర్యాన్ని పదేపదే తల్చుకొంది. అప్పటి శ్రీనివాసరావుకి - యిప్పటి శ్రీనివాసరావుకి తేడా తల్చుకొని యేడుపుని దిగమ్రింగలేక పోయింది.

మనసులోనూ - మనిషిలోనూ వ్యత్యాసం బాగా కనిపించింది. భర్తకు దడిసి, పుట్టింటికి పారిపోదామని కాసేపు అనుకొంది. అది తనపట్ల భావ్యం కాదని నచ్చచెప్పుకొంది.

ఆరోజున మళ్ళా శ్రీనివాసరావు యేదో అభూత కల్పన వొకటి చేసి, జానకిని మరింత నిరాశాభావానికి లోబడేలాగు చేసాడు.

“ఇంటి పాలేరుతో సరసాలాడుతోందని, శ్రీనివాసరావు ఆ దృశ్యం చూసానని” అనటంతో జానకి హృదయం మరింత గగ్గోలుపడి జీవితంమీద విరక్తిని సృష్టించుకొంది. యీ యింట్లో తన కెలాంటిస్థానం లేదని ఖచ్చితంగా తేల్చుకొంది. శ్రీనివాసరావువల్ల యావజ్జీవితం సుఖపడనని నమ్ముకొంది.

దెబ్బలవల్ల శరీరమంతా నొప్పులతో వేధించుతోంది. యేపని చేయడానికి ప్రయత్నించలేకపోతోంది. యిలాంటి స్థితిలో, “పాలేరువానితో తను చేసినపని జ్ఞాపకం వచ్చింది,” యిందులో నిజం భగవంతుడికే తెలియాలి. అన్యాయం - అక్రమం యెల్లకాలం నిలబడవని తెలుసు. తనకీ - పాలేరుకీ సంబంధం యేవిధంగానూ లేదు. యీ మాట జానకి చెప్పితే యెవరు వింటారు? లోకం యెలా నమ్ముతుంది.

జానకి ఆరాత్రి కుమిలి కుమిలి యేడ్వసాగింది. సగం రాత్రి జరిగింది. శ్రీనివాసరావు వూళ్లోనుంచి యింకా యింటికిరాలేదు. ఒక్కసారి యిల్లంతా కలయచూసింది. కొత్తచీర, కట్టుకొంది. నుదుట కుంకుమ పెట్టుకొంది. దొడ్లో పూసిన రెండుమల్లె మొగ్గల్ని తల్లో తురుముకొంది. వసారాలోవున్న దేవుళ్ల పటాలకు వంగి నమస్కారం చేసి, మళ్ళా ఒక్కసారి యిల్లంతా కలయ తిరిగి మనస్సులో శ్రీనివాసరావుకి భక్తి వినమ్రురాలై నమస్కరించి, అతని ఘోరబాధలకు, లోకపు నిందలకు స్వస్తి చెప్పుతూ, వూరిబయట మోటబావికి దారితీసింది. బావిసమీపిస్తున్నకొద్ది, జీవితం విలువ పెరగసాగింది. ఆ విలువకు గౌరవంయివ్వకుండా జానకి శరీరం హృదయం - మానవత్వం - నీళ్ల అడుగుకి మునిగిపోయినవి. -

తెలతెలవారుతూండగా తేలిన జానకి శరీరం చూస్తూ, వెలుగుని దాచుకొంటున్న నక్షత్రాలు కడసారిగా నిర్వేదించి, సూర్యుని కిరణాలకు మటుమాయమైనయి. ప్రాణాలు మాత్రం మరోజీవితంలోకి ప్రవేశించినయి. ఒక స్త్రీ పురుడుపోసుకొంది. ఆ రోజు సాయంకాలానికి జానకి శవం ఆస్పత్రికి ‘పోస్టుమార్టం’కి వచ్చింది. యథావిధిగా శస్త్రచికిత్స పూర్తయిన తరువాత జానకి శవం ఆస్పత్రి ఆవరణదాటి వెళ్లిపోయింగి.

వెళ్లిన తరువాత జానకి యెవరో డాక్టరు పద్మకి బాగా గుర్తొచ్చింది. జగన్నాథంకి గుండెలో పెద్ద కూతురు పిల్చి “నాన్నా”అన్నమాట కలుక్కుమంది. జానకి మరణానంతరం పద్మతనలో తాను వాక్చిత్రం చెప్పుకొంటూ, ఆనాటిరాత్రి నీలినీలాకాశంలో, మినుకు మినుకుమంటూ మెరిసిపడే నక్షత్రాల్లోకి చూస్తూ, “పాపం! జానకికూడా అలానక్షత్రాల్లో ఒక్క నక్షత్రమైవుండిపోతే యెంత బాగుంటుంది -” అని నిర్వేదించింది.

అంతరాత్మ “తప్పకుండా అలా అయింది” - అంది.

పద్మ, జానకి యొక్క నక్షత్రం ఆ నక్షత్రాల్లో యెక్కడుందోనని పరీక్షగా వెతకసాగింది - ఆమె నక్షత్రం కనిపించకముందే జానకి సౌందర్య స్వరూపం, నవ్వు ఒక్కసారి తన అంతరాత్మలో ప్రతిబింబించి పద్మను సానుభూతిరాల్నిగా చేసినయి.

# ఐదు నిముషాలు

హిందీమూలం :
"వియోగిజీ"

అనువాదం :
శ్రీ వి. యస్. రామమూర్తి

గడచిపోయింది! ఐదు నిముషాల కాలమూ-యిట్టే గడచిపోయింది! జైలు కమ్ములకవతల సతమతమౌతూ మావారు, యివతల పోలీసుల పహరాతో బిక్కుబిక్కుమంటూ నేను; - కడపటిసారిగా కలుసుకోవడాని కనుమతింపబడిన ఐదునిముషాలు ఇట్టే గడచిపోయినై!

♦ ♦ ♦

గడచిపోయిన సంఘటనల్ని జ్ఞప్తికి దెచ్చుకోవడంలో లాభమేముందీ? - శూలాల్లాగ హృదయాన్ని చీల్చి వేయడం కంటె అవి చేయగల మహోపకారమేదీ లేదు. నా బాధల్ని యితరులకు చెప్పుకొందామన్నా మనస్ఫూర్తిగావిని, సానుభూతి చూపగలిగిన సహృదయులేరీ? అథవావిన్నా "చెల్లీ, మనమేంజేస్తాం నీవదుక్కొచ్చిందింతే నమ్మా, నీకా భగవంతుడేదిక్కు" అంటారే కాని.

భగవంతుడట - భగవంతుడు ఎవరా భగవంతుడు? ఎక్కడున్నాడా భగవంతుడు? పీడితులగు అభాగ్యుల నెన్నడైనా రక్షించాడా, - విపత్సముద్రములో మునిగి సర్వనాశనమగువారికెవరికైన చేయూతనిచ్చాడా? అన్నార్తులకు పట్టెడన్నము పెట్టగలిగాడా? దుఃఖితుల కన్నీరు దుడువవలెనన్న భావమైనగలదా ఆ భగవంతునకు? ఊహూఁ - మచ్చుకైనా లేదు. స్వర్గంలోని నందనవనంలో కేళీవిహారాలు సల్పుతున్న అతనికి తీరికేది? భగవంతుడుగూడ చిన్నభార్య చేతి కీలుబొమ్మేనేమో? చిన్నమ్మగారి చూపెవరిపైనుంటుందో వారే అతనికి సన్నిహితులుగాని నావంటి దరిద్రురాలులెక్కేమిటి? దురదృష్టమే దరిద్రుల యిలవేల్పు. పెద్దమ్మ ముద్దు బిడ్డనగు నేను లక్ష్మీలోలుడగు భగవంతుని వేడుకోవడమెందుకూ? నిర్భాగ్య దేవతా ప్రార్థనమే నా కర్తవ్యము. ఆశ్రితవాత్సల్య ప్రకటనమునందామె కామెయే సాటి. శరణన్నదే తడవుగా యిట్టే దర్శనమిచ్చి, మరోకొండంత యాపదను నెత్తిపైబెట్టి, వికటంగా నవ్వుకొంటూ చల్లగా జారుకొంటుందా మహాతల్లి!

ఒక్కమారా చల్లని తల్లిని తలచుకొన్నంతనే పట్టభద్రుడు, బీదవాడు, నిరుద్యోగియగు వానికి నన్నంటగట్టి చంకనెగురవేసికొంది; రెండవమారు తలచినదే తడవుగా యిద్దరు బిడ్డల తల్లినై కూర్చున్నా, మూడవమారు తలచుకొన్నానో లేదో - నా జీవనసర్వస్వము, నా ప్రాణనాథుడు ఖూనీనేరంక్రింద జైలుకెళ్లాడు - మరణదండన విధింపబడ్డది. అంతే, అంతా

పూర్తిమై పోయింది. యింక నెందుకామెను పిలవడం ?...

బీదరికమేఅన్ని అపరాధముఃకు మూలమైతే అతనికి మరణదండనమే విధించండి, గుండుపెట్టి కాల్పించండి, చీల్చి కాకులకు గ్రద్దలకు పడవేయండి. కాని కాస్త నామాటవినండి – అతడు ఖూనీకోర్ కాదు, బీదవాడుమాత్రమే; అపరాధిగాదు, ఆకలిగొన్నవాడు; ఆపదలలో జిక్కియుండెనేగాని హత్యజేయలేదు; అన్నార్తుడేగాని యీయన పాపిమాత్రముకాదు.

ఇంతకూ ఆయన జేసిందేమిటి ? ఎట్టి మహాపాపమున కొడిగట్టారాయన? లేదే– ఆయన ఏయపరాధము జేయలేదే ? తన కడుపుకోసం, తన యాలు బిడ్డలకోసం తిండికై ప్రయత్నించాడు. దురదృష్టం యీ కాస్త ప్రయత్నాన్నే "ఖూనీ" యన్నది. అందుకు సిద్ధంగా కాచుక కూర్చొన్న చట్టము యీమాత్రానికే నిర్దాక్షిణ్యంగా మరణదండన విధించింది. కానీ పరవాలేదు – నిస్సంకోచంగా చెప్తున్నా – ఫరవాలేదు; అతడు చనిపోనీ, ఉరికంబమునుండి వ్రేలాడనీ – కానీ నాకేమోసంతోషమే. ఎందుకంటూరా? అతడు నిరపరాధి! ఒకసారిగాదు. నూరుసార్లు, వేయిసార్లు చెప్పగలను – అతడు పాపిగాదు; దరిద్రుడు, అభాగ్యుడు, అన్నార్తుడు–అయినా అతడూమనుష్యుడే– అతనిలోను మానవత్వం ఉంది.

నిజమే, – అతడాకలిబాధకు సహించలేక దుర్జనసహవాసంచేశాడు. దొంగిలించాడు, మోసంజేశాడు, దారులుగాచి దోపిడీచేశాడు; యిన్నీ చేసినా కడుపు కొఱకే. నైతికదృష్టితో జూస్తే అతడు అపరాధి, పాపి, దోపిడి దొంగ, ఖూనీకోర్ కాని కాస్తయోచించండి – నైతికశాసనాల్ని బీదవాళ్లే అనుసరించాలా? సాంఘిక నియమాలు, ధార్మిక శాసనాలు నిర్భాగ్యుల కొఱకేపుట్టేయా? ? బీదరైతులకు అప్పులిచ్చి, తుదకు అసలు ఫాయదాలకై వారి భూమిబుట్రల నాక్రమించి వారిని నిరాశ్రయులుగా జేయుచున్నాడే 'రామ్ధన్ తేలీ' మహాశయుడు – అతని చక్రవడ్డీ రేటు ప్రభావమూ అని వందలకొద్దీ కుటుంబములు దిక్కులేక అల్లోలకల్లోలమాయని ఇలవుటించుచున్నవే – అతని చల్లని చూపుతోనే శ్మశానాలైన పండంటి కాపురాలకు లెక్కేలేదే – యిది పాపంగాదూ ? యిదియపరాధంగాదూ ? ఆకలి దీర్చుకొనుటకు ప్రయత్నించిన నా భర్తదా అపరాధము? మాట్లాడరేం – ఉరితీయండి – అతన్ని ప్రపంచంనుండి వేరుజేయండి – ఈ చర్యతోనే పాపంనశిస్తుందా ? ప్రపంచంలో అపరాధముయొక్క నామరూపాలే లేకపోతవా ? మరి పాపమన్నదే ఉండక

పోతుందా భూమ్మీద? ...... కాదు. అట్లెన్నటికిని జరుగదు.

౨

ప్రభుత్వమువారి యొద్దనుండి నిన్ననే నాకో ఉత్తరం వచ్చింది. నా భర్తనాతో కడసారిగా మాట్లాడదలచాడట — కడపటి సారి. ఎల్లుండే అతన్ని ఉరితీస్తారు. చనిపోయేముందు — కడపటిసారిగా తన భార్యా బిడ్డలను జూడవలెననీ, వారితో మాట్లాడి సెలవుపుచ్చుకోవలెనని యిష్టపడ్డాడు. నా ప్రాణేశ్వరుని యిచ్ఛానుసారము తుదిసారి వారి దర్శనమునకై బయలుదేరితిని. నేనవరినైతే చూడబోవుచున్నానో వారిపై మృత్యుదేవత తన చల్లని చేతులుంచుటకెదురు చూచుచున్నదనియు, వారిమెడలో దగిలించుటకై ఏర్పాటైన యురిత్రాడు ఊగిసలాడుచున్నదనియు, వారిశవమున కప్పుటకై నూతన వస్త్రము తయారుగానున్నదనియు నాకు బాగా తెలుసు — కాని ఆయన యిప్పుడు మనమధ్య, మనవలెనే బ్రతికియున్నాడు - ఎంతటి యాశ్చర్యమైన విషయము!

మీరే యోచించండి మీకత్యంత ప్రియుడగు వ్యక్తి మృత్యువు చేజిక్కినాడనుకొనుడు. అతనిని జూడ్డానికి మీరు బయలుదేరి వెళ్లుతారు. ఎవరినైతే మీరీ దినం చూచుచున్నారో, అతడే రేపు ఉరిత్రాటినుండి గిలగిల తన్నుకొని చనిపోతాడు. అతని శవము మీ వద్దకు చేర్చబడుతుందని యనుకోండి. అప్పటి మీ పరిస్థితి నూహించుకొని నావ్యథనర్థముజేసికొనుటకు ప్రయత్నించండి. దుఃఖభారంతో నేను చట్టాన్ని ధిక్కరించడంలేదు. న్యాయాన్ని నిందించడంలేదు. నా దుఃఖాన్ని వ్యక్తం జేసికొంటున్నానంతే. మనుష్యులతో గాదు, వారియందణగియున్న మానవత్వంతో నాగోడుజెప్పుకొంటాను. "చెప్పు, సోదరీ! మానవత్వమా! నీవైన చెప్పుము. న్యాయము మూగది, గ్రుడ్డిది, చెవిటిది- దానికి హృదయంలేదు. అది అందరినీ ఒకే విధంగా విచారించి తీర్పుజెబుతుంది. కాని నీలో "మంచి" ఉంది. ఈ శాసనాలు, ధర్మసూత్రాలు దాన్ని అణగద్రొక్కలేవు. చెప్పు, నాదైన్యమును న్యాయము ముందు నీవైనవివరించు!"

ఎట్లో యాంత్రికంగా వారివద్దకు బయలుదేరాను. ఎన్నెన్నో యోచనలతో నడువసాగాను.—ఆఁ, ఒక్కసారి వారి పాదాలకు చుట్టుకొంటాను, వారి వక్షస్థలంలో తల దాచుకొని తనివిదీర నా బాధను వెళ్లబోసికొంటాను. "నన్ననాథనుజేసి పోతున్నారా, నాకై స్వర్గంలో కాచియుండండి, — యీదీనురాల్ని మరచిపోరుకదూ......? పాపిష్టిదాన్ని, మీ పాలపొంగులాంటి యౌవనంలో విషంచిలికించి మంటగలి

పాను. మీయభివృద్ధికి సర్వవిధముల అడ్డు తగుల్తూవచ్చాను... అవన్నీ మరచి నన్ను క్షమించరూ? ఇదిగో మీ బిడ్డడు. వీణ్ణిదగ్గరకు తీసికోండి. ఒక్కసారి.... ఆఖరుసారి పితృవాత్సల్యము నీతనిపై వర్షించండి.'' అల్లకల్లోలంగా ఉన్న మనస్సును అదుపులో పెట్టుకోలేక ఎట్లాగో జైలుదారి వెంబడి కాళ్ళీడ్చుకొంటూ నడుస్తున్నా. వెంటనడుస్తున్న గోపీ నా చేతిని తన రెండు చేతులలోకి తీసికొని, ''అమ్మా, మనమెక్కడికి పోతున్నాము''అని యడిగాడు. ఏమని జవాబిచ్చేది? ఏ విధంగా వివరించేదా పసిబిడ్డకు? తుదకెట్లో గుండె రాయి జేసికొని, ''గోపీ, మీ నాన్నగారిని చూడ్డానికెళ్తున్నామమ్మా; వారికి నిన్ను చూడవలెనని యున్నదట'' అని చెప్పాను.

ఈ జవాబుతో గోపీ చాల సంతోష పడ్డాడు. ''ఏమ్మా - నాన్న చాల రోజుల్నుండి మనింటకే రాలేదే! నాన్న చాల మంచివాడుగదమ్మా, మరేం-యీ సారి ... నాకు మాంచి బొమ్మలు కొని పెట్టమని నాన్నను అడుగుతాను. ఆ బొమ్మల్లో చెల్లాయికి ఒక్కటిగూడ యివ్వను. నాన్న మా నాన్నే. చెల్లాయి నాన్న కాదు. నాన్న తెచ్చే బొమ్మలన్నీ నాకే గదమ్మా'' - గోపీ అమాయకత్వం నా హృదయాన్ని ఛిన్నా భిన్నం చేయ సాగింది. పిచ్చి తండ్రి! నాన్నగారు మృత్యు దేవత ఒడిలో కూర్చొని, నిముషములు లెక్కించుకొంటున్నాడని వాడికేం తెలుసు! అసలు జైల్లో ఉన్నాడనికూడ తెలియదాయె. తుదకెట్లో నిగ్రహించుకొని, ''బాబూ! దేవుడే మనకిక దిక్కు'' అని మాత్రం అనగలిగాను.

''ఎప్పుడొస్తాడమ్మా! నాన్న? ఎప్పుడో ఎందుకూ - ఇప్పుడే నాతోనే పిల్చుకొచ్చేస్తా. నాన్నే-...నా కోసం-అచ్చం జయగోవిందు దగ్గరున్నట్టిదే-చిన్న సైకిలు తెస్తారు. చూడమ్మా, వాడు నన్ను తన సైకిలును తాకనన్నా తాకనీడు. విరిగిపోతుందంటాడు. కుల్లుబోతు వెధవ. తాకితేనే సైకిలు విరిగిపోతుందా అమ్మా? ... చెల్లాయినిగూడ నా సైకిలు ముట్టుకోనియ్యను - అది నిన్న నా పలక విరగ్గొట్టేసింది. వద్దంటే ఏడుస్తుంది-చుప్పనాతి. ఉండు, నేనంతా నాన్నతోజెప్పి దాన్ని బాగా తన్నిస్తా!''

3

''ఈమెను తీసుకెళ్లు'' జైలరు ఆజ్ఞనిచ్చాడు. పోలీసు బంట్రోతు వెంట జైలు కాంపౌండులోనికి వెళ్లాను. యిరువైపులా కారాగారపు గదులు, బలిష్టమైన సంకెళ్లు, వానిలో బంధింపబడిన మానవులు - ఈశ్వర సృష్టిలోకెల్ల శ్రేష్టముగా పరిగణింపబడు మానవులు! ఒకరిద్దరుగాదు, వందలకొలదీగలరాజైల్లో. యీ ప్రపం

చంలో నేనొక్కతెనే కాదు అభాగ్యురాలిని- నాబోటివాళ్లు వేలు, లక్షలు గలరు.

దూరపు చూపుకే భయము గొల్పు నట్లున్న ఒక చీకటికొట్టు ముందాగాడు పోలీసు. ఖైదీలు, పోలీసులు, చీకటికొట్లు- ఈ భీకరవాతావరణం గోపీని పూర్తిగా భయపెట్టేసినట్లుంది. వాడు గడగడ వణకుచు నా కాళ్లకు జుట్టుకొన్నాడు.

“ప్రకాశం!” అని ఎలుగెత్తి పిలిచాడు పోలీసు.

నేను నాలుగు వైపులా కలయ జూచాను. ఎదురుగానున్నదే ఉరికంబము నెక్కుటకు సిద్ధముగానున్న ఖైదీలనుంచు గది. కరాళ మృత్యువదన గహ్వరము. మాట్లాడేశక్తి యుండినట్లైతే ఆ గది ప్రపంచంలోని వివిధ సాహిత్యములకంటె విపరీతము, విభిన్నము, భయంకరము అగు విషయముల నెన్నింటినో వినిపించగలిగి యుండెడిది. ఈ గది గోడలలోని ప్రతి యిటుకయు ఖైదీల నిట్టూర్పుల వేడికే బాగా కాల్చబడినట్లున్నవి. గది నేలపై పడి యింకిపోయిన కన్నీటి బిందువులన్నీ ఒకచోట చేర్చినచో యీ ప్రపంచములో నాగరికులమని చెప్పకొనువారిలో సగము మంది ఆ కన్నీటి మడుగులో సీదులాడ వచ్చునేమో! గదియందంతయు మృత్యుఛాయ గాఢముగా నలముకొనియున్నది. భీకర మృత్యునాట్య విన్యాసమునకు నాంది యన్నట్లు ఆ చీకటికొట్టులో యినుప సంకెళ్లు బరువుగా ఘుల్, ఘుల్, ఘుల్ మన్నవి.

ప్రాణావశిష్టమైన యొక యువక శరీరము ద్వారమువద్దకువచ్చి నిలువబడినది. అతడే ఆ యంధకూపములోపడియున్న “ప్రకాశం;” అంధకారమయమగు నాయనాథ జీవితప్రకాశము, తన బిడ్డలపాలిటి యాశా ప్రకాశము.

“ఐదు నిముషాలు మాత్రం వ్యవధి యివ్వబడ్డది. మాట్లాడుకోండి త్వరగా ... కాలం మించిపోతుంది.”

ఖైదీకి నేనేమైన యిచ్చెదనేమోయను అనుమానంవల్ల నేను ఖైదీకి దూరముగా నుండవలయునని యాజ్ఞాపింప బడినది. తలెత్తి వారివైపుజూచాను. అబ్బ ... ఎంతటి హృదయ విదారకముగానున్నదా రూపము! గడ్డం, జుత్తు దట్టంగా పెరిగినవి. చెదరిన జుత్తు గడ్డంలో కలిసిపోయి యున్నది. కన్నులు బాగా లోతుకు దించుకుపొయ్యాయి. పూచిక పుడకతో పోటీపడుచున్నట్లున్నదా శరీరం. “బాబూ గోపీ! మీ నాన్నగారికి నమస్కరించమ్మా” అన్నాను, మూడేండ్ల బుడుతడు తల పూర్తిగా నేలకాన్చి తండ్రికి నమస్కరించాడు. నేనూ వారి పాదాలకు నమస్కరించాను. కాని వారి పాదాలను స్పృశించడానికూడ నోచుకోలేదీ అభాగ్య

రాలు. కమ్ముల తలుపున కావలివైపున మసక వెలుతురులో నిలువబడియున్నారు మావారు. వారి కళ్లల్లో నీళ్లు తొణుకుతున్నాయి. గద్గద స్వరంతో "సు ... శీ ... భ ... వ ...! యిదియే మనం కడసారి కలసుకోవడం, నా కడసారి యాశీర్వాదం, మన కడపటి పలుకులు. అంతే ... ముగిసింది. రేపు తెల్లవారివచ్చి నా శవాన్ని తీసుకపో. నేనా విషయమై జైలరుతో జెప్పాను."

నెత్తిన చేతులుంచుకొని నేనట్లే చతికిలబడితిని.

"నాన్నా! యింటికిరావూ" నా హృదయంపై గొడ్డలితో గొట్టినట్లైనది - ఎంతటి యమాయకమైన కోరిక!

"బాబూ! నేను దేవుని దగ్గరికెళ్తున్నా, నువ్వు బుద్ధిగా చదువుకోనాన్నా-అమ్మను కష్టపెట్టకు గోపీ!"

యికవారుకన్నీటి నాపులేకపొయ్యారు. జైలు కమ్ములను పిడికిళ్లలో బిగించి స్థాణువవలె నిలువబడ్డారు.

"నాన్నా! చెల్లాయి ఏడుస్తూంది. అది నాపలక విరగ్గొట్టేసింది. నాకింకో పలక తెచ్చీనాన్నా! - అదేంనాన్నా! నువ్వు ఏడుస్తున్నావు?"

వారు తలను రెండుచేతులతోను పట్టుకొని దీనంగా నావేపుజూచారు. బరువుగా నిట్టూరుస్తూ, "వింటున్నావుకదూ-; గోపీ పలక విరిగిపోయిందట-వాడికింకోపలకకొని పెట్టు."

నేనేమని బదులు పలికేది!-నా రెండు చెవులుశ్రవణశక్తిని గోల్పోయినట్లనిపించినది. కన్నులుపూర్తిగా చీకట్లు క్రమ్మివేసినవి.

"బాధపడకు సుశీ! మనస్సును గట్టిజేసికో. బిడ్డలను ప్రేమతో పెంచి, పోషించు. గోపీని బాగా చదివించు ... నాకాలం. గడచిపోయింది. ఇక బిడ్డలకు తల్లీ తండ్రీ అంతానీవే. నాకై చింతించవద్దు. జరగవలసిందెల్లానూ జరిగిపోయింది. బాధపడిమాత్రం చేయగలిగిందేముంది?"

"ఏమండీ!.. మరి... మరి"

నాకంఠం బొంగురు పోయింది. గుండెల్లోని రక్తంధారలు గట్టికళ్లలోప్రవహింప సాగింది. మరిమాట పెగల్లేదు.

"కానీయండి, ఐదునిముషాలు దాటిపోయింది" పోలీసు హెచ్చరించాడు.

"మంచిది, సుశీ! ... శలవు... నాకై గోపీనోమారు ముద్దు బెట్టుకో, చూచియైన ఆనందిస్తాను. సుశీ! ... సుశీ! ... భగవంతుడు నీకు ధైర్యమునిచ్చుగాక! వచ్చే జన్మలో కలసికొందాం... శలవ్-"

"ఊఁ చాలించండి ... పదవయ్యా, లోపలికెళ్లు" గద్దించాడు పోలీసు.

# అశ్రుతర్పణం

'పద్మ - నరేశ్'

విద్యార్థులు తమ సెలవులను ఆనందంతో హాయిగా గడపి ఆనాటికానాడు స్కూళ్లలో కాలుపెట్టే రోజులవి. అప్పటికీ - అంటే పాతకాలపు చదువులకు, యిప్పటికీ - అంటే నవనాగరికతా వాతావరణంలో పెరిగి పెద్దవారయిన యీ నాటి విద్యార్థుల చదువులకూ చాలా భేదంవుంది. నేటి చదువంతా పుస్తకాల రూపంలో మారిపోయింది. తక్కువ పుస్తకాలు పట్టుకొన్నవాడే యీనాడెక్కువ ప్రజ్ఞావంతుడు.

అప్పటికి స్కూళ్లు తెరచి వారంరోజులయింది. కాని సెలరోజులవరకు విద్యార్థులు చేరడము, పోవడము జరుగుతూనేవుంటుంది. ఆ వూర్లో అదొక్కటే స్కూలు. మూర్తి తన తరగతిలో ఓ మూల బెంచీలో కూర్చునివున్నాడు. దేనికో అతని మనస్సు అతని స్వాధీనంలో లేదు. ఆలోచనాపరంపరలో మునిగి తేలుతున్నట్లుంది. ఆ తరగతిలో అట్టే ఎక్కువమంది పిల్లలులేరు. ఎవరికివారు పిచ్చాపాటి మాట్లాడుకొంటున్నారు. మూర్తి అవన్నీ యేమి గమనించకుండా తన ఊహాసౌధాల్లో విహరిస్తున్నాడు.

మూర్తి అప్పటికే స్కూల్ ఫైనల్‌లో రెండుమారులు దండయాత్రలు సాగించి మరల తృతీయ దండయాత్రకు సన్నద్ధుడౌతున్నాడు.

ఇంతలో అంత పెద్ద గలబా వున్నట్లుండి తక్కున ఆగిపోయింది. తరగతిలో పిల్లలందరు లేచి నిలబడ్డారు. ఆ సమయంలో ఓ క్రొత్తవ్యక్తి ఆ తరగతిలో ప్రవేశించాడు. అతని వేషధారణజూచి యుపాధ్యాయుడని తలంచారు విద్యార్థులు. కాని అతడు నేరుగాపోయి ఓ బెంచిలో కూర్చోగానే తమ తప్పును తెలుసుకొని సిగ్గుపడి తిరుగా గలబా చేయడం ప్రారంభించారు. అతని తల నున్నగదువ్వి క్రాపింగ్ స్టైల్లో చూడ చక్కగానుంది. అతని ముఖం ఫేస్ పౌడర్‌తో నిగనిగ మెరుస్తూవుంది. అతను ధరించియున్న లాల్చీ, ధోవతి నిజంగా అతడొక వుపాధ్యాయుడేయని నిరూపించేట్లువుంది. కాని అతడొక బెంచీమీద కూర్చోబట్టి విద్యార్థుడని తేలింది. ఆ కూర్చోవడం మూర్తి ప్రక్కనే తటస్థించింది. కాని మూర్తి అతను తన ప్రక్కన కూర్చున్నది గమనించలేదు.

కాసేపు ఆ నూతనవ్యక్తి నిశ్శబ్దంగా కూర్చున్నాడు. ఎంతసేపని వూరకనే కూర్చుంటాడు ... మెల్లగా ప్రక్కకు తిరిగి 'ఏమండీ! యీ స్కూలు యిలావుందే' మని అడిగాడు మూర్తిని. దాంతో మూర్తి కాస్త తరగతి వాతావరణంలోకి తొంగి చూచాడు. 'ఏమంటున్నారూ' అని ఆ నూతన వ్యక్తిని పలుకరించాడు మూర్తి ...

'ఏమీ లేదు .. యీ స్కూలు యిలావుందేమండీ! అని అడుగుతున్నాను'

'ఈ స్కూలు వాతావరణమే యింత, స్కూలు తెరచి వారంరోజులయినా ఒక్క అయ్యవారు వచ్చిన పాపానపోలేదు' అని జవాబిచ్చాడు మూర్తి.

కాసేపు యిద్దరూ మౌనం వహించారు. ఎవ్వరికేమీ పాలుపోలేదు. కొద్దిసేపటికి మూర్తి అతని వైపుకు తిరిగి 'యేమండీ! మీ పేరు తెలుసుకోవచ్చా' అని ప్రశ్నించాడు.

'ఆఁ! నా పేరాండి! నాగేశ్వరరావు. కానండి అందరు నన్ను నాగేష్ అంటారులెండి' ... అని దీర్ఘాలుతీస్తూ సమాధానమిచ్చాడు. ఆ మాటలతో మూర్తి అతను వుత్తరాదినుంచివచ్చినవాడైవుంటాడని తలంచాడు.

'మీకేమౌతారండీ ?...'

'మాది పిఠాపురమండి. మా నాన్నగారిని యీ వూరికి బదిలీ చేశారు సర్కిల్ యిన్స్పెక్టరుగా. అందువల్ల యిక్కడికి వచ్చేశాము కుటుంబసమేతంగా'... అని జవాబిచ్చేడు నాగేష్ ...

'మీది మొదటేదేనా' అని ప్రశ్నించాడు మూర్తి.

'కాదండి! రెండుమార్లు తప్పాను.' చిరునవ్వుతో చెప్పాడు నాగేష్ ...

'అయితే యిరువురం ఒకే తరగతికి చెందామన్న మాట' అన్నాడు మూర్తి చిరునవ్వుతో...

అలా వాళ్లు మాట్లాడుచుండగా కొన్ని కోయిలలు ఎదురుగావున్న మిద్దెమెట్లు ఎక్కిపోవడం తటస్థించింది. ఇంతలో మూర్తిమిత్రుడొకడు ఆ వైపు రావడంచూచి 'హల్లో రత్నం' అంటూ పిలిచాడు. ఆ పిలుపుతో మిద్దెమెట్లు ఎక్కిపోతున్న ఓ కోయిల వెనక్కి తిరిగి చూచింది. మూర్తి మిత్రుడు దగ్గరికొచ్చాడు. ఆ కోయిల వెనుకకు తిరిగిచూచి నిలబడటంతోటే మూర్తి, నాగేష్‌లుకూడా ఆమెవైపు చూచారు. ఇంతలో చెంతలోవున్న మరో కోయిల 'రత్నం యిక్కడనిలబడితే బాగుండదు, రాపోదాం వెనుకనే టీచరు వస్తున్నారు' అంటూ లాక్కుపోయింది. ఆ అమ్మాయి రత్నం అని మూర్తి పిలువగానే వెనుదిరిగిచూడడంవల్ల, మరో కోయిల ఆ అమ్మాయిని రత్నం అని పిలవడంవల్ల ఆమె పేరు రత్నం కాబోలు అని తలంచారు ముగ్గురు. మూర్తి తనుచేసినపనికి నొచ్చుకొన్నాడు - దురదృష్టవశాత్తూ తన మిత్రునిపేరు - ఆమె పేరు ఒకటిగావడం జరిగింది. మూర్తి రత్నాన్ని నాగేష్‌కు పరిచయం చేశాడు. రత్నంకూడా అదే తరగతి కావడం మూర్తికి కొద్ది ఆనందాన్నిచ్చింది.

రత్నం ఆ స్కూల్లో ఆఖరిమెట్టే అంటే యస్. యస్., యల్. సి. చదువుతూవుంది. మూర్తి, నాగేష్‌ల తరగతి అయినా సెక్షను బేధం. ఆడవాళ్లంతా 'ఏ' సెక్షనులో వుండడం పరిపాటి. రత్నం చేయకుతగట్టు స్కూల్లోవున్న విద్యార్థినులలెల్ల రత్నమే. ఆ రోజు ఆమె కట్టిన నల్లంచు తెల్లచీర ఆమె దేహచ్ఛాయలో మెరుస్తుండినది. ఆ నాటి ఆమె చూపులు యువకుల హృదయంలో మరుతూపులు. ఆమె నడక హంస నడక. ఆ నడకను ఆమెను గమనించిన ప్రతీ యువకుడు తన హృదయంలో సోపానాల నమర్చుకొంటాడనే దాంట్లో ఆశ్చర్యంలేదు.

స్కూల్లో పాఠాలు సక్రమంగా జరగడం మొదలెట్టాయి. మూర్తి, నాగేష్, రత్నంల స్నేహం రానురాను గాఢంగా అల్లుకొంది.

స్కూల్లోని యస్. యస్., యల్. సి. విద్యార్థినుల బృందం వారి తరగతికిపోవాలంటే మూర్తి, నాగేష్‌ల తరగతివైపునుంచి మిద్దెమెట్లు ఎక్కిపోవాలి. రత్నం తన క్లాసుకు వెళ్ళేటప్పుడు, వచ్చేటప్పుడు యీ మిత్రత్రయంవైపుచూచి చిరునవ్వు నవ్వుతూ వెళ్ళేది. కాని మిత్రత్రయానికి ఆమె ఎవరినిజూచి నవ్వుతోందో అర్థంకాలేదు. ...

## 2

అలా రోజులు గడచిపోతున్నాయి. ఒక రోజు మూర్తి తన సాయంకాలపు పారువేట ముగించుకొని యింటికి బయలుదేరాడు. త్రోవన కూని రాగాలు తీసుకొంటూపోతున్నాడు. ఓ వీధి మలుపు తిరిగేప్పటికి నాగేష్ - రత్నంలు కలసిరావడం చూచాడు. మూర్తిని చూడటంతోటే వారిరువురి మొహాలు తెల్లబడ్డాయి. కాని మూర్తి ఆ సమయంలో మాట్లాడడం బాగుండదనుకొని తలవంచుకొని వెళ్ళిపోయాడు.

మరు రోజు మూర్తి క్లాసులో అడుగుపెట్టేటప్పటికి, అంతకుముందేవచ్చి ఏదో పుస్తకం చదువుచున్న నాగేష్ తలెత్తిచూచి ఓ చిన్న చిరునవ్వు విసిరాడు. మూర్తి ప్రతి నవ్వుతో నాగేష్ ప్రక్కనే కూర్చున్నాడు.

'ఏం నాగేష్ అంతా కులాసేనా' అని ప్రశ్నించాడు మూర్తి. 'ఆహా! ఏదో తను దయవల్ల' అని

నవ్వుతూనే జవాబిచ్చాడు నాగేష్ ...

‘ఆ! మా దయ యేమిటిలే వుండేవాళ్ల దయ వుండాలిగాని’ అని అన్నాడు మూర్తి.

‘ఎవరిమీదరా అంత దయ’ అంటూ అందుకున్నాడు రత్నం ...

‘నీ దయేరా బాబు’ అని టక్కున జవాబిచ్చాడు మూర్తి.

అంతలో కిలకిలలు వినబడ్డాయి. ముగ్గురూ తల త్తి ఆ వైపు చూచారు. ఆ విద్యార్థినులు మేడ మెట్లు ఎక్కిపోతున్నారు. ఆ రోజు ఎందువల్లనో రత్నం మొహం ముడుచుకొనివుంది. భయపడిన లేడి కన్నులు ఎంత జాలిని ప్రదర్శిస్తాయో అదేవిధంగా ఆమె నేత్రాలు అంత జాలిని ప్రస్ఫుటపరుస్తున్నాయి ...... ఎక్కడినుంచి దుమికాడో టీచరు అమాంతంగా లోపలికి రావడంతోటే ముగ్గురు ఆ వైపు నుంచి తలలు త్రిప్పుకొని లేచి నిలబడ్డారు.

టీచర్ పాఠం చెప్పుకొని పోతున్నాడేకాని నాగేష్ బుద్ధి మాత్రం ఎక్కడోవుంది. ఇంటర్‌వెల్ కాగానే నాగేష్ పుస్తకాలు పట్టుకొని లేచాడు. ‘ఏం నాగేష్ అప్పుడే లేచావ్’ అడిగాడు రత్నం. ‘నా మనస్సేమి బాగాలేదు. మూర్తి! సాయంత్రం నీవునన్ను సి. ఏ. పార్కులో మీట్ చేస్తావుగాదూ.’

‘అలాగేలే’ అన్నాడు మూర్తి

‘అలాగే అంటేకాదు. తప్పక కలియాలి సరేనా’ అంటూ యింటిత్రోవ పట్టాడు నాగేష్.

సాయంత్రం నాగేష్‌ను కలుసుకొన్నాడు మూర్తి పార్కులో. ఇద్దరూ కలసి అలా పొలాలవైపు బయలుదేరారు. ‘మూర్తి! నీకో రహస్యం చెప్పాలని నిన్ను రమ్మన్నానోయ్’ అన్నాడు నాగేష్ నవ్వుతూ

‘రహస్యం ఎక్కడైనా యితరులకు చెప్తారేమిటోయ్’ అంటూ మూర్తి అతని నవ్వులో తననవ్వును కలిపాడు.

‘ఓరి పకీరాని! నిన్న నీవు జూబిక’ - అని అంటుండగానే సన్నివేశాన్ని కూర్చి ‘ఎవ్వరికీ చెప్పవద్దంటావ్ - అంతే కాదూ’ చిరునవ్వుతో ప్రశ్నించాడు మూర్తి...

నాగేష్! మెల్లగా నవ్వాడు......

‘నాగేష్! జరిగిందేదో జరిగిందిగాని నీకు ఆ అమ్మాయికి యేలాపరిచయం కల్గింది.’ అడిగాడు మూర్తి. నాగేష్ యిలా చెప్పడం ప్రారంభించాడు.

“ఆ రోజు ఆదివారం. ఏమి పాలుపోక అలా సినిమాకెళ్లాను. ఆ రోజే రత్నం కూడా వచ్చింది. కాని నేనామెను చూడలేదు. నాకు వెనుక ప్రక్కనున్న కుర్చీలో వుండింది. అట్టే జనంకూడ లేరు. న్యూస్ రీలు ప్రారంభించారు. నేను సిగరెట్ కాలుస్తూ చిత్రం చూస్తున్నాను. ఇంతలో వెనుకనుంచి ‘సినిమా హాల్సులో సిగరెట్లు త్రాగవచ్చా’ అనే వాక్యం వినబడింది. ఎవరిసా అని వెనుదిరిగి చూచాను. రత్నం నవ్వుతూ ‘మిమ్మల్నేనండి నాగేష్‌గారూ!’ అని మెల్లగా అన్నది. ‘క్షమించండి మీకు కష్టంగా వుంటే ఆర్పేస్తాను’ అంటూ సిగరెట్‌ను నలిపివేశాను. ‘మీరు ఎక్కువగా సిగరెట్లు కాలుస్తారే. గుండె చెడిపోదటండీ’ అని అడిగింది, ‘నా ఆరోగ్యమును గురించి మీకెందుకీ శ్రమ’ అని అడిగాను. ‘ఒకే స్కూల్లో చదువుకొంటున్నాం కాబట్టి’ జవాబిచ్చింది రత్నం. మాకు సామీప్యంలో ఎవ్వరూ లేరు కాబట్టి మేము మాట్లాడుకోవటానికి ఎలాంటి అభ్యంతరము లేకపోయింది. ‘రేపు మీకో లెటర్ యిస్తాను తీసుకెళ్తారా’ అని అడిగింది. ‘సరే’ నన్నాను. ‘మీ యిల్లెక్కడో తెలుసుకోవచ్చా’ అని ప్రశ్నించాను. ‘మీరు స్కూలుకు వెళ్లేదోవలోనే’నని జవాబిచ్చింది. ఆ మూడు గంటలు మాటలతో దొర్లిపోయింది. ఇకనేముంది మరురోజు ఆమె తన తమ్ముడి ద్వారా లెటర్ పంపడం మనం జవాబివ్వడం......యిలా మా స్నేహం విస్ఫారితున్న మొగ్గమాదిరి అభివృద్ధి కాజొచ్చింది” అని తన ప్రేమ చరిత్రను పూర్తి చేశాడు నాగేష్.

ఇంతకూ ఆ అమ్మాయి పూర్తి పేరేమిటి? మూర్తి ప్రశ్న 'గీతారత్నం' నవ్వుతో చెప్పాడు నాగేష్.

'అలాగేలే నాగేష్. యీ విషయం ఎవ్వరికి చెప్పనులే నా మనసులోనే వుంటుంది. కాని రత్నంకు తెలుసా యీ విషయం.' అన్నాడు మూర్తి

ఏమో నాకు తెలియదు. కాని గీత స్నేహితు రాలు ఒకర్తెవుంది. ఆ అమ్మాయి పేరు కనక్ బాల, ఆ అమ్మాయి రత్నం స్నేహితురాలట...

"అయితే మన స్కూలులో లైలా - మజ్ను, అనార్కలి సలీంలు వున్నారన్నమాట" అంటూ మూర్తి నవ్వుతూ లేచాడు.

"నీ విక్కడ యితరులతో చెప్తావని గీతకూడ భయ పడుతూవుంది. ఆమే నిన్ను తీసుకరమ్మంది. కాని నే చెప్తానులేఅని సర్దివేశా"నుఅంటూ నాగేష్‌కూడా లేచాడు. ఎవరింటి త్రోవ వారు పట్టేరు.

3

ఆ నాడాదివారం. కష్టజీవులకలకలలు ఆనాడే అగుపిస్తాయి. సాయంత్రమయింది. పక్షులు తమ సంచారాన్ని చాలించి గూళ్లకు చేరుకొంటు న్నాయి. గీత ఆనాడు ప్రతి రోజుకంటె కొద్ది యెక్కువగానే ముస్తాబయింది. అదిచూచి గీత చెల్లెలు లక్ష్మి

'ఎక్కడికే యింతముస్తాబు ?' అనిప్రశ్నించింది. కాని గీత తన తొందరలో జవాబు చెప్పలేదు.

గీతతో కలసివస్తున్న మనిషి లక్ష్మి యొకర్తే. లక్ష్మికి పదునాల్గేండ్లుంటాయి. గీతకన్న తీసిపోదు అందంలో. ఒకరికొకరు ఆత్మీయులు. వారికి తల్లిలేదు. తండ్రి అంతగా పట్టించుకోడు. ఆయన పట్నంలో ఓ పెద్ద కారుకంపెనీకి ఏజంటుగా పనిచేస్తుండేవాడు, అప్పుడప్పుడువచ్చి చూచి పోతుండేవాడు. ఇంట్లో పనిమనుషులుండేవారు.

గీత ముస్తాబు పూర్తయింది. బయలుదేరేముందు తొందరగా రమ్మని చెప్పింది లక్ష్మినవ్వుతూ...

అలాగేలే అంటూ గొంతులేస్తూ బయలుదేరిందిగీత.

నాగేష్ నవ మన్మధ మొలకలా తయారయ్యాడు. కాస్త కాఫీ నీళ్లు త్రాగి ఎవ్వరితో చెప్పకుండా బయలుదేరాడు.

అతను చేరదలచుకున్న స్థలంచేరాడు. ఎందుకో చూడగల్గినంతవరకు ఆతృతతో చూచి చూచి చివరకు అగుపించక పోయేటప్పటికి నిస్పృహతో ఓ చెట్టు క్రింద కూర్చున్నాడు.

సూర్యుని మీద మబ్బులు ఆవరించివున్నాయి. సంధ్యకాంతులు తియ్యని ఆలోచనలను కల్గిస్తున్నాయి.

అలా యేదో పెద్దవస్తువు పోగొట్టుకున్న వాడల్లె దిగాలుపడి కూర్చునివున్నాడు.

ఇంతలో 'నాగేష్' అన్న తీయని కంఠం విని పించింది. నాగేష్ ముఖం చంద్రుని చూచి కలువ విప్పారినట్లు వికసించింది. 'గీతా' అని మృదు వుగా పిలిచాడు. ఇద్దరూ ప్రక్క-ప్రక్కనే కూర్చు న్నారు. సూర్యుడు వీరి సంగతి మనకెందుకులేయని కాబోలు పశ్చిమాద్రిలోకి మాయమౌతున్నాడు.

'నాగేష్ యిక్కడికెలా వచ్చావు' ప్రశ్నించింది గీత. ఆప్రశ్నలో ఎంత అమాయకం!-నవ్వుకొన్నాడు మనసులో నాగేష్ -

'ఏం అలా అడుగుతున్నావ్ - నీవేలావచ్చావు' అని ఎదురు ప్రశ్నించాడు నాగేష్.

'మీవల్లే !' అంది చిరునవ్వుతో

'ఆ ! నావల్లనా !' ఆశ్చర్యంగా అడిగాడు నాగేష్.

"ఆ ! ఆ నాడు మిమ్మల్ని చూడకపోతే, సినిమాలో మాట్లాడకపోతే నేనిప్పుడు మీదగ్గరుండే దాన్నా. మీ స్నేహితుడు మూర్తి 'రత్నం' అనిపిలు వకపోతే నేను మీవైపు చూచేదాన్నా-అప్పుడతను నన్ను పిలుస్తున్నాడని ఆశ్చర్యమేసింది. అతనెవరో నాకు తెలియదు - ఇంతలో మీ స్నేహితుడు రత్నం

కాబట్టి అతన్ని నాకు చాలా కాలంనుంచి తెలుసు కాబట్టి సర్దుకపోయేను - లేకంటేనా ……"

'ఏం చేసేదానివి -'

'వెంటనే వచ్చి మూర్తి చెంప చెడేలుమనిపించేదాన్ని.' 'అ అ! మూర్తే యిప్పుడు మనరహస్యాన్ని దాచిపెట్టివున్నాడన్న సంగతి మరచావా గీతా …'

'లేదు నాగేష్ నాకు సోదరులు లేకున్నా అతన్ని నా సొంత సోదరునిగా భావిస్తున్నా……'

'ముఖ్యంగా మనలను కలిపింది సిగరెట్ కదూ!' అంటూ దగ్గరకు తీసుకున్నాడు నాగేష్ గీతను.

సూర్యుడు పూర్తిగా మాయమయ్యాడు. చంద్రుడు మెల్లగ పైకి తారలతో వస్తున్నాడు. ఆ ప్రశాంత గంభీర వాతావరణంలో యే జీవి అయినా ఎంతో హాయిని పొందగలదు. "అటు చల్లని గాలి - యిటు నీలి నీడలు - చూచావా నాగేష్! చంద్రుడు మనలను పొంచి పొంచి చూస్తున్నాడు …… ఎంతహాయిగా వుంది - నీ అరచేతి కాంతులు చంద్రకాంతిలో సంధ్యకాంతులవలె మెరుస్తున్నాయి - అంటూ నాగేష్ ఒడిలో వాలిపోయింది. గీత … …"

'మనము జీవితాంతమువరకూ యిలాగేవుంటామా నాగేష్.' 'ఈ లోకంలోనే గాదు - పైలోకంలో కూడా యిలానే వుండాలని కోరుతున్నాను గీతా' అని గీతను తన వక్షస్థలానికి అదుముకున్నాడు.

గీత నాగేష్ ఒడిలో ఎంతో ఆనందంతో వాలిపోయింది. ఆ ప్రశాంతతలో ఆ చల్లనిగాలి పాటలలో ఆ పున్నమినాటి చంద్రుని చల్లని కిరణాలలో వారి దేహాల్ని వారు మైమరచారు. ఆదినం వారికి మరువరానిది. అలాంటి దినాన్ని ప్రతీయువకుడూ కోరుతాడు. ఆ ఆనందాన్ని ప్రతీ జీవి కోరుతుంది. దూరాన వున్న కుక్క మొరగటంతోటే వాళ్లు ఊహాసౌధంలోనుండి వూడిపడ్డారు. ఈలా వారి ప్రణయం శుక్ల పక్ష చంద్రుని వలె దినదినాభివృద్ధి చెంద సాగింది.

దొంగతనం ఎన్నాళ్లని దాగుతుంది. మూర్తి వూరుకుండినా యితరులు వారినిగురించి ఏలా మాట్లాడుకోకుండా వుండగలరు? స్కూలంతా ప్రాకిపోయింది నాగేష్, గీతల, ప్రణయకలాపం.

స్కూల్లో తమ సంగతి పూర్తిగా తెలిసినదానికి యిద్దరూ చాలా భయపడ్డారు. నాగేష్ ఈ విషయం యింట్లో తెలిస్తే ఏం మునుగుతుందో అని మరింత భయపడసాగాడు. కానీ గీతకు యింట్లో భయం లేదు. తన తండ్రికి తనేమి చెప్పినా వింటాడనే ధైర్యంవుంది. నాగేష్‌ను పెండ్లాడ దలచినానని తండ్రితో చెప్పడానికి నిశ్చయించుకుంది.

(సశేషము)

(176 పేజి తరువాయి)

రా: అసలు సంగతి చెప్పక... ఏమిటమ్మా ఈ రభస!

దు: అవునురా? రభసగానే ఉంటుంది... (అని దీర్ఘాలు తీస్తూ) ఊరికే అన్నారా పెద్దలు - తల్లి విషం వెళ్ళాం బెల్లమని...

రా: (సరాసరి వంట యింటిలోకి వెళ్లి సీతను కొడతాడు)

సీ: ఏమండి... నేనేం చేశానండి (అని దీనంగా కండ్లలో నీరు నింపుతుంది)

రా: అహో... పోయి క్షమాపణ వేడుకో...

సీ: (త్వరగావచ్చి) నా తప్పు మన్నించండి ... మీ కెక్కడికి వెళ్ళకండి)—

దు: పోతే మాత్రము పోనిస్తారా... అన్నము పెట్టు... రారా రామూ......

♦ ♦ ♦

జానకి: అత్తగారూ... (బిగ్గరగా) ఓ అత్తగారు... చెముడేమిటండీమీకు... పిలిచి పిలిచి పిలిచీ మా గొంతు పోవాల్సిందేకాని మీరుమాత్రం రారు...

వెం: (భయపడుతూ) పిలిచావా...

జా: ఆ పిలిచాను...ఇంకా పిలవాలా... నీళ్లుతోడుతారా...

వెం: ఆఁ తోడుతా... రాండి...

జా: (స్నానాల గదిలో) అత్తగారు... ఒక మారిలా రండి... నేను మనిషినా లేక మీలాంటి మృగాన్ననుకున్నారా... బ్రతికటానికేనా ఈ వేడి...

వెం: చన్నీళ్లు పోస్తాను ఉండమ్మా (అని చన్నీళ్లు పోస్తుంది)

జా: అబ్బ ఈ చన్నీళ్ళకు యింత సేపాలస్యమా...నీకు బుద్ధిలేనట్లుందే...

వెం: అదేమిటమ్మా! అట్లా అంటావు... ఎంత చెడ్డా... అత్తనుగదా...

జా: ఛీ! ఇంకా ఎదురుకూడా మాట్లాడుతున్నావా... తూ... అని పోతుంది

వెం: భగవంతుడా నన్నికనైనా తీసికెళ్ళాగా...

జా: (బిగ్గరగా) ఏమండీ? వడ్డించండీ... త్వరగా... ఆకలేస్తోంది.

వెం: రామ్మా రా... వడ్డించాను.

(జానకి భర్త కేశవులూ భోంచేస్తుంటారు)

వెం: కూరలు బాగున్నాయామ్మా...

జా: ఆఁ మీ మొఖంలాగున్నాయి. చూడు పప్పులో ఉప్పులేదు. పచ్చడిలో కారంలేదు... నా ఖర్మ కొద్దీ దొరికారు... ఎన్నిసార్లు చెప్పినా అర్థమయితేగా...

కే: పోనిద్దూ .. రేపు నేను చేస్తాను చూడు వంట! బాగుంటే రోజూ చేస్తాను...

జా: సరే... ఈరోజు సినిమాకు వెళ్ళాలి...టిక్కెట్టు తీసుకరండి.

కే: దేవిగారి ఆజ్ఞ... మరి డబ్బు

జా: నా పర్సులో 1 రూపాయి తీసికెళ్ళి ఒకటిక్కెట్టు తేండి... మీరు ఎనిమిదణాలకు వెళ్తారా?

కే: సరే...

# చిన్నమ్మ కథ

శ్రీ ఏకుమల్ల కామేశ్వరరావు

(గత సంచిక తరువాయి)

## కథయొక్క ప్రాముఖ్యత

చిన్నమ్మకథ చాల ముఖ్యమైనది. తెలుగు దేశంలో మహా పతివ్రతలు, వీరవనితలు, కవయిత్రులేగాక మహా భక్తురాళ్లుకూడ ఉదయించేరు. తరికొండ వెంకమ్మ ప్రసిద్ధిని పొందింది. చిన్నమ్మకూడ అట్టిదే! ఉత్తర హిందూదేశములోకూడ గొప్ప భక్తురాళ్లు ఉన్నారు. రాజపుత్ర స్థానంలోని రాణి మీరా బాయి గొప్ప కృష్ణభక్తురాలు. ఈమె 15 వ శతాబ్దిది అని కొందరు, "మామగారి పాదము పట్టుకొని నీళ్లతో కడిగి, పైకొంగుతో అద్ది, కంటితో అద్దుకొని, పాద జలమును శిరసావహించి, మామ చిన్నమ్మతో మనవిచేయుచున్నది. ఇట్లుండగా యీకాలములో ఉండే కోడండ్లు అత్తవచ్చినా లేవరు, మామవచ్చినా లేవరు, మొగుడువచ్చినా లేవరు......"

పైన ఉదరింపబడినవాటిలో ఈనాడు అని చెప్ప బడేకాలం ఇరవయో శతాబ్దమేకాని మారొకటి కాదు. క్రీ. శ. 1550 ప్రాంతంలో పుట్టిన పదంలో అట్టి వాక్యాలను వినువారిని ఆకర్షించడంకోసం పాటకులు చేర్చినవే అని నిర్ణయించవచ్చు. ఈ పాటలో చెప్పబడ్డ చెంగల్వరాజు అనుపేరు పాటకుని పేరు కాని తథా రచయితదికాదు. పాటగాళ్లు అనేక పాటలను పాడుతూంటారు కదా! కోడూరి చెంగల్వరాజు (వీరయ) ఈ పాటకుని పూర్తిపేరు కావచ్చు. ఇతను పెదబొబ్బిలిరాజు ద్విపదనుకూడ పాడేవాడేమో! ఏదయినా వీరద్దరు చెంగల్వరాజులు కారు; ఒక్కతే అని స్థూలంగా చెప్పకో వచ్చు. మొత్తంమీద ఈ జంగం కథను రచించిన కవి మాత్రమే తెలియలేదు.

అక్బరు కాలందని కొందరు అంటారు. ఈమె భర్తవల్ల, మామగారివల్ల నానా బాధలుపడి చివరకు కృష్ణపరమాత్మ సాయుజ్యపొందింది.

చిన్నమ్మను అత్తవారు పెట్టిన బాధలు మనం విన డానికి కూడ సహించం. అటువంటి బాధలను ఆమె కొంచమైనా కోపించక భరించింది. అంతేకాదు. చిట్టచివరసారి ఆమెకు భగవంతుడు దర్శనమిచ్చి 'నీ కిష్టమైనది కోరుకో చిన్నమ్మా!' అని అడగగా, ఆమె తనమాట అటుంచి, తన జీవితాన్ని యమలోకం చేసిన అత్త, మామ మొదలైనవారికి మొదట వైకుంఠమిమ్మని కోరింది. ఆమాట వినిన భగవంతుడే ఆశ్చర్యపోయి 'వారికా స్వర్గం?' అన్నాడు. కాని ఆమె పట్టుదలతో వారికి వైకుంఠం సాధించి పెట్టింది. ఆమెకుగల సహనం, క్షమ అద్భుతం! ఆటువంటి భక్తశిఖామణి పుట్టిన దేశం పవిత్రమైనది.

## అతిలోకాంశాలు

చిన్నమ్మవంటి మహా భక్తురాలి జీవితంలో అనేక అతిలోకాంశాలు ఉండక తప్పదు. ఇతరులకు అవి అసహజమైనవిగా కనబడతాయి. కాని మహా భక్తులకు అట్టివి సహజాలే. ఒక సాధారణుడు ఒక పెద్ద రాయి నెత్తలేడు. కాని ఒక వస్తాదు పెద్ద రాతి నెత్తడం, ఇనుపగొలుసు తెంపడం, ఏనుగు చాతీమీద ఎక్కించుకోడం, మోటారుకారును ఆపడం సహజాలే! అట్లే మనకు అసాధ్యమైనవి కొన్ని ఈశ్వర కటాక్షాన్ని పొందిన భక్తులకు సహజాలే! కాని ఇట్టివాటిలోకూడ అతిశయోక్తులు చేర నవకాశ ముంది. కాబట్టి వానిని విమర్శించి చూడాలి.

తన భక్తురాలిని కాపాడడానికి ఈశ్వరుడు అనేక కృషులను చేసేడు. ఆమెను మామగారు కొడుతూన్నందుకు దేవుడు కోపించి, అతనిని బాధించగా, చిన్నమ్మ సహించలేక, స్వామిని ప్రార్థించి, అతనిని బాధనుండి రక్షించింది. బావగార్లు చిన్నమ్మను మరికొన్ని బాధలు పెట్టదలచుకోగా, స్వామి వారిలో పెద్దవాడి మనస్సును వశంచేసుకొని, కొన్ని బాధలు తప్పించేడు. కుండలో అన్నమంతా దాసరివాడి ఎంగిలిచేశాడు అని తెంగళరెడ్డి చెప్పగా, పెద్దన్న ఆ అన్నాన్ని పరీక్ష చేసి పదభిప్రాయాన్ని తెల్పగా మిగత అందరు మెత్తబడ్డారు. వారు ఆమెను నల్లమలలకు పోయి పచ్చగడ్డిని తెమ్మని పంపించేరు. ఎండాకాలంలో అక్కడ పచ్చగడ్డి పుట్టదు, కాని దైవసహాయంవల్ల పని జరిగిపోయింది.

దేవుడు చిన్నమ్మకు ఒకవైపు సాయంచేస్తూ మరోకవైపు భక్తిని పరీక్షచేసేడు. మద్దులేటిస్వామి దాసరి వేషం వేసుకొని చిన్నమ్మ వస్తూన్న దారిలో నిలబడి, ఒక్క కబళం పెట్టమని బతిమాలేడు. కుండలో ఉన్నదంతా ఒక్క కబళంకింద తినివేసి 'నీవు ఇద్దరికేమి సమాధానం చెప్పతావు?' అని కొంటె ప్రశ్న వేసేడు. 'ఆమె నన్ను మద్దులేటి స్వామే కాపాడుతాడు' అని చెప్పింది. ఆమె చెప్పినట్లే సమస్త పదార్థాలు కుండలో తయారయేయి. అట్లే స్వామి మరోకసారి చిన్నమ్మను భోజనం పెట్టమని అడిగేడు. ఆమె 'మంచి పదార్థాలు లేవు, కుండ లేదు, విస్తరి లేదు' అని చెప్పగా, వాటికోసం ఆమెను ప్రయత్నం చేయమన్నాడు. ఆమె ప్రయత్నం వృథాకాగా, వాటిని తానె సృష్టించేడు. ఆమె అత్తింటివారు కక్షకట్టి హింసించగా, స్వామి ఆమెను పరీక్షలపాలుచేస్తూ కాపకు రక్షించేడు.

మత మాఢ్యానికి మితిలేదు. ఆమె అత్తింటివారు ఆమె దాసరులను కొల్వకూడదన్నారు. దాసరికైతే విస్తరాకు ఈయ్యనన్నాడు తంబళ చెంచయ్య. అట్లే కుండ నీయనన్నాడు కుమ్మరి. అటువంటివారంతా తగిన శిక్షలను పొందేరు.

కీడుచేసినవారికి మేలుచేయి అనే సూత్రాన్ని చిన్నమ్మ తన జీవితంలో పూర్తిగా అనుసరించింది. నిండు పాతేటిలో తనను బాధించినవారు మునిగి తేలుతూండగాను, కదిరి కొండకు వెళ్లేదారిలో అత్తింటివారి బళ్లు విరిగిపోగాను, క్రూరుడైన ఆమె భర్త కళ్లుపోయి ఏడుస్తూండగానూ, ఆమె దేవుణ్ణి ప్రార్థించి వారిని రక్షించింది. ఆమె క్షమకు అంతు, దరి కనబడదు. కాని ఆమెనుబాధించిన దురాత్ములను స్వామి ఊరికే విడిచిపెట్టలేదు. ఓలంకొండను కాల్చి భస్మం చేస్తేనేకాని ఆయన కడుపుమంట చల్లారలేదు.

## సాంఘిక జీవనం

ఈ కథ నిండ ఆనాటి సామాన్య ప్రజల సాంఘిక జీవనం ప్రతిబింబిస్తూంది. ప్రజల నిత్యజీవితావసరాల దగ్గరనుంచి మత విశేషాల వరకు ఉన్నాయి. అనేక రకాల వ్యక్తులు దీనిలో కనిపిస్తారు. వ్యవసాయం చేసుకొనే రెడ్లు, గొల్లవారు, రెడ్ల వ్యవసాయం, వారు పశువుల నమ్ముకోవడం, పొలంలో చేసే పనిపాట్లు, అక్కడి భోజనం, గడ్డికోత, వర్షపుబాధ, వ్యవసాయపు పనిముట్లమోత, ఏరువాకేటప్పుడు పడవలసిన అవస్థలు, ఇళ్లకు పొలాలకి ఉండే విపరీతపు దూరం మొదలైనవి కళ్లకు కట్టినట్లుగా వర్ణించబడ్డాయి. రెడ్లు మొక్కుకొంటారు. మొక్కుబళ్లు తీర్చుకొంటారు. కష్టాలప్పుడు సోది అడుగుతారు. జాతరలకు బళ్లమీద పోతారు. పిల్లలులేనివార్లు నోములు నోచుకొంటారు.

పెళ్లి ఒప్పందమయేక పెళ్లి పత్రిక రాయించుకొంటారు. పెళ్లి అయేక పట్టుకువచ్చిన సూడిదలు - ఇప్పటికీ పల్లెటూళ్లలో ఉన్నట్లే - ఊరివారికి పంచిపెడతారు. పనిలేనప్పుడు రాట్నం వడుకుతారు. పెద్దవాళ్లమీద భక్తిశ్రద్ధలు చూపించడానికి, వారి కాళ్లు కడిగి ఆ జలం తమ తలలమీద జల్లుకొంటారు. జంగములంటే, దాసరులంటే భక్తి. పొలంలో పని చేసివచ్చి స్నానం చేసుకొని భోజనంచేస్తారు. దొన్న తిళ్లు, గడ్డికోతులు, సమారాధనలు ఇవన్నీ ఈ కథలో విరివిగా కనబడతాయి. వ్యవసాయదా

రుల మాటలు వారిలాగ మోటుగా ఉంటాయి. మోటు మనుష్యుల శిక్షలుకూడ మోటుగానె ఉంటాయి.

చీమల మానుకి తల్లిని విరగ గట్టమన్నాడు.

బాగుగ పండిన జొన్న చేలకి బలికొట్టమనిరి.

ఆకాలంలో వరహాల బేరముండేది. ఇళ్లకి కంచు బోడు తలుపులుంటాయి. వద్రంగులు హంస గద్దె పీటలు తయారుచేసేవారు. కుమ్మర్లు పెద్ద పెద్ద కుండలు తయారుచేసేవారు. హంసల బండీమీద ప్రయాణం చేసేవారు.

ఆకాలపు సామాన్య సంఘంలో మాధ్వభక్తి క్రూరకార్యాలకు దారితీసింది. తాను నమ్మినవాడికంటె మరొక దేవుడు లేడనడం మాధ్య భక్తే. చిన్నమ్మ పడరానిపాట్లుపడి చివరకు జయించింది.

## పాత్రపోషణ

చిన్నమ్మ కథాకల్పనలో అన్ని అంగాలు సరిగా ఉన్నాయి. ఈ కథంతా సంఘటనలతో నిండిఉంది. ఉట్టి వర్ణనలు ఎక్కడా లేవు.

పాత్రపోషణలో లోట్లుకానరావు. చిన్నమ్మను బాధపెట్టిన అత్తింటివారు మొదటినుంచి చివరిదాక ఒక్కలాగే ఉన్నారు. వారిలో పెద్దన్నగారొక్కడే —అదైనా మద్దులేటి దేముడు ఆవేశించినప్పుడు మాత్రమే—కొంత సబబుగా మాట్లాడేవాడు. అత్తమామలు, పెద్ద తోడికోడలు ఒకరికొకరు తీసిపోరు. చిన్నమ్మకి ఊరవతల గుడిసెవేసి భంగపుచ్చినందువల్ల, చివరకు పసుల కాపరులకుకూడ లోకువైపోయింది.

చిన్నమ్మకథ ప్రారంభంనుంచి చివరిదాక ఒక్కలాగ వుంది. అత్తమామలు దుర్మార్గులైనా వారిమీద ఆదరణే. వారి కాళ్లు కడిగి నెత్తినిజల్లుకొనేది. వారు కష్టాలపాలైతే చూడలేదు; దేవుణ్ణి రక్షించమని ప్రార్థించింది. తనయందు గౌరవంలేని వారైనప్పటికీ ఆమె పసుల కాపరులను ఎంతో గౌరవంగా పిలిచింది. ఆమె ఆదర్శ యువతి, మహాపతి వ్రత, మహా భక్తురాలు.

మద్దులేటి దేవుడుకూడ ఈ కథలో ఒక పాత్రే. ఆయన భక్తపక్షపాతి. చిన్నమ్మను ఇతరులు పెట్టే కష్టాలనుంచి కాపాడేడు. 'అవి నీ బాధలు కావు. నావి, అన్నాడు. కాని అంతటితో పోనీయలేదు. ఆమెకు తనమీద నుండే భక్తిని అడుగడుగున పరీక్ష చేసేడు. మహాభక్తుల చరిత్రలు ఇట్లె ఉంటాయి. భక్తి పరీక్షలో చిన్నమ్మ పూర్తిగా నెగ్గింది. వైకుంఠాన్ని సంపాదించుకొంది.

ఈ కథలో చిన్నమ్మ తలిదండ్రులు మొదటిలో కనబడ్డారు. అటు తర్వాత ఆమెను, వారికి దూరమైపోయింది. ఆమెగతినే విచారించలేదు. అమ్మాయి తన జీవితమంతా అత్తవారింటిలోనె గడపాలన్నది సబబే. కాని దుర్మార్గుల సముక్షంలో చిత్రవధల పాలుకావాలన్నది జ్ఞానముకాదు. ఇది హిందూ జీవన విధానంఅనడం సబబుకాదు. తుచ తప్పకుండ ఈ కాలంలోకూడ దానిని మనం అనుసరించాలనడం అజ్ఞానం. దుర్మార్గులకు తగినశిక్ష సంఘమే వేయాలి, సన్మార్గులను కాపాడాలి.

చిన్నమ్మ తర్వాత మహా పతివ్రతయైన సన్యాసమ్మ ఉదయించింది. చిన్నమ్మ పడ్డటువంటి కష్టాలకొన్ని ఆ ఇల్లాలుకూడ పడింది. తనను కన్న భూదేవి కీర్తిని నిలబెట్టింది. ఇటువంటి నారీమణులను కన్న ఆంధ్రదేశం చాల అదృష్టవంతురాలు.

## అతిశయోక్తులు

ఈ కథలో అతిశయోక్తులు లేకపోలేదు. ఏడు కుండల దొంతిలో మధ్య కుండలోపెట్టిన దీపం పద్నాలుగేండ్లుందిట! సంఖ్యల లోపం ఈ పుస్తకంలోకూడఉంది. రెడ్డి అమ్మకానికి అరువేల ఎడ్లను తీసుకొని వెళ్ళేడుట! కోట్లకొలది దాసరులు, కోట్లకొలది బంధువులు వచ్చేరుట! రామలింగస్వామిని అర్చిస్తూ ఒక కోటిమందికి సమారాధన చేసేరుట! ఎరుకల నాంచారికి మూడుకోట్ల

ధనం పోసిందిట! చిన్నమ్మ కోటికేలమందికి సంతర్పణ చేసిందిట! సంఖ్యయొక్క అర్థాలు తెలియకపోతే వచ్చేలోపమిది.

## ఇది సుఖాంతకథా?

ఇది సుఖాంతకథా లేక దుఃఖాంతకథా అనేది ఒక చర్చనీయాంశం. కథ అంతటా కష్టాలున్నా ఆఖరున మాత్రం కష్టాలు తీరితే దానిని సుఖాంతకథలలోనె జమచేస్తారు. కాబట్టి ఈ కథకూడ సుఖాంతకథే! అష్టకష్టాలు పడ్డా చిన్నమ్మకి భగవంతుడు చిట్టచివరకు వైకుంఠమందు సుఖమీయలేదా!

## కొన్ని సంప్రదాయాలు

జంగంకథలకుండే అనేక సంప్రదాయాలు ఈ కథలో కనబడుతున్నాయి. నాగమ్మ అను పేరు అట్టిదే. ప్రధానపాత్రయొక్క పుట్టుకదగ్గరనుంచి మరణందాక వర్ణించబడింది. సుఖాంతంగా కథ అంతమయింది. ఈ కథలో ఏడు అంకె, దానిరెట్లు విరివిగా వాడుకచేయబడ్డాయి. ఇట్లే మరి కొన్నిటిని చూపించవచ్చు.

## రసపోషణ

కథ అంతటా దుఃఖరసమే కనబడుతూంది. కవి కన్నీటిధారతో కథ రాశాడా అనిపిస్తూంది. కష్టాలను ఏకరువు పెట్టేచోట, అతను ఒక్క పసరైనా వెనుకకు తగ్గలేదు. వాటి నన్నిటిని నేర్పుగా పూసగుచ్చినట్లుగా చెప్పేడు. ఈ కథలో ప్రధానరసం దుఃఖరసమే! ఇతర రకాలైన సంఘటనలుకూడ ఉన్నాయి. అచ్చమ్మ పూజలు, చిన్నమ్మ వివాహం ఇత్యాదులు. కాని ఇవి కథలోని ప్రధానరసానికి పోషకాలుగా ఉన్నాయి; కాని ప్రత్యేకశాఖలై అనైకమత్యంగా ఉండలేదు.

రైతాంగం జీవితం అతిసహజంగా చిత్రించబడింది. ఊరొకచోట వ్యవసాయ మొకచోట! ఇట్టిది పశ్చిమాంధ్రంలో సామాన్యం. ఊరికి ఆరు మైళ్ళదూరంలోకూడ వ్యవసాయ ముంటుంది. అటువంటప్పుడు అడవులలోంచి వెళ్ళవలసిన అవసరంకూడ ఉండవచ్చు. ఈ కథలో అటువంటి సన్నివేశమే చిత్రించబడింది. పొలానికి వెళ్ళడానికి చిన్నమ్మ అడివిలోంచి వెళ్ళింది. దారి తెలియక గోప బాలురను ప్రశ్నించింది.

పొలంలో రైతులు భోజనాలకు సిద్ధమై, దూర దూరంగా పని చేసుకొనేవారిని ఏలాగు పిలుచుకొన్నారో చూడండి—

పెద్దరెడ్డి గోవిందరెడ్డిని కూతేసి పిలిచె
నడిపిరెడ్డి నలనాగరెడ్డిని కూతేసి పిలిచె
నరసింహారెడ్డి "రారా ఓ గంగిరెడ్డి"
పెంచెలరెడ్డి "రారా ఓ నరసింహారెడ్డి"

అప్పుడు తమ్ముణ్ణి కూతేసి పిలవమన్నాడు. అన్నగారుకూడ విన్నాడు వెంగళరెడ్డి.

(సశేషము)






**విరుల సరులు:** శ్రీమతి చుండూరు రమాదేవి, ఏలూరు, పశ్చిమ గోదావరిజిల్లా. వెల. 0-12-0

ఈ కావ్యము, పద్యములు, గేయముల కలయిక, చక్కని భావ, రస పోషణలతో మనోజ్ఞంగా సాగిన యీ రచన ప్రశంసా పాత్రము.

ఈయమ రచనాశైలి యితోధికముగా వృద్ధిపొంది ఆంధ్రవాఙ్మయమునకు శోభ కలిగించుగాక!

**నీలాపనిందాపహరణము:** శ్రీ ఆకుండి వ్యాసమూర్తి శాస్త్రిలుగారు. ప్రచురణ కర్త: విదూషకవిద్వాన్ శ్రీ ఆకుండి వేంకటశాస్త్రి, 17 గోవిందరాజస్వామి తేరు వీధి, తిరుపతి. వెల. 0-3-0

వినాయక చతుర్థినాడు చదువుకొనుటకనుకూలముగా నుండునటుల రాఘవాచార్య సూరి విరచితంబైన విఘ్నేశ్వర చరిత్ర, పరిష్కర్త శ్రీ వ్యాసమూర్తి శాస్త్రిలుగారు శుద్ధమై, సరళమైన శైలిలో కావ్యరచన సాగించారు. ఆంధ్ర ప్రజానీకం ఉచితరీతిన యీ చిన్న కావ్యమును ఆదరింతురని మా విశ్వాసము.

**చిత్రమాలిక:** చిత్రకారుడు శ్రీ ఆర్. వెంకటరావు, కాళహస్తి.

ఇందులో లినోకట్ చిత్రములున్నవి. చిత్రకారుడు తన నైపుణ్యాన్ని కళాభిమానులముందు, చిత్రకారులముందు పెట్ట నుద్దేశించి ఈ పుస్తకాన్ని ప్రచురించాడు.

ఇందులోని చిత్రాలు పది సంవత్సరాలలో ఆంధ్రపత్రిక, ఆంధ్రప్రభ, ఆంధ్రమహిళ, సౌభాగ్యలలో ప్రచురించ బడినవి. చిత్రకారుని అనుభవ పటిమలకు యీ గ్రంథము నిదర్శనము. అభ్యుదయ దశలోనున్న చిత్రకళానైపుణ్యం ముందు ముందు చిత్రకారుని ఉత్తమోత్తములలో నొకరుగా రూపొందించగలదని మా విశ్వాసం.

**మాతృదేవీలీల:** శ్రీ కామరాజు హనుమంతరావు. ప్రచురణకర్తలు: ప్రాక్ప్రతీచీ గ్రంథమాల, రాజమహేంద్రవరము. వెల. రు. 1-0-0

ఇది శ్రీ కామరాజు సుందరమ్మగారి జీవిత చరిత్ర. శ్రీ హనుమంతరావుగారు ఆమె జీవిత చరిత్రను ఆదర్శనీయమైనదిగా గుర్తించి గ్రంథరూపంగా వెలువరించి మహిళాలోకానికి మహోపకారంచేశారు. ప్రతి ఆంధ్రనారీ రత్నము చదువతగినది.

---

# సంపాదకీయములు

## మహిళా సంక్షేమము :

మహిళా సంక్షేమ కార్య కలాపాలు నిరక్షరాస్యత నిర్మూలన, విజ్ఞాన వికాసాల వ్యాప్తి, దారిద్ర్య నిర్మూలన, ఆరోగ్య సౌభాగ్యాల పెంపు నుద్దేశించి సాగాలి.

సంఘంలో సౌభాగ్యవంతమయిన జీవితమును రూపొందించుకోడానికి విద్య అత్యవసరము. విద్యననుసరించిన విజ్ఞానవికాసాలు అన్నిరంగాలలోను పురోగమించడానికి ఉపకరిస్తవి. దేశకాల పరిస్థితులను అర్థము చేసికొని తాము, తోడివారు సుఖించడానికి విద్యా విజ్ఞానాలు అత్యవసరము.

అన్ని సమస్యలను అర్థం చేసికోడంతోబాటు తమ కుటుంబ ఆర్థిక వ్యవస్థను సయితం అర్థంచేసికొని జీవయాత్రను సుఖప్రదం చేసికోడానికి విద్యా విజ్ఞానములు ఎంతైనా ఉపకరించగలవు.

దేశం సౌభాగ్యవంతము కావడానికి, ప్రపంచము శాంతి అభ్యుదయాలవైపు పురోగమించడానికి. పురుషులతోబాటు స్త్రీలు విద్యావంతులు కావాలి. కాని స్త్రీలు ఆర్జించిన విద్యా విజ్ఞానాలు కుటుంబం, దేశం సౌభాగ్యవంతమయిన సుఖప్రదమైన జీవితం గడుపడానికి తోడ్పడాలి.

ఆరోగ్య వసతులు మెరుగు కావలసిన అవసరం సయితం మన దేశంలో చాలయున్నది. ప్రసూతి కేంద్రాలు, మాతా శిశు సంరక్షణాలయాలు విస్తారంగా ఏర్పడి మహిళల ఆరోగ్యము చక్కగానున్ననాడే కాని సంతానము సయితం ఆరోగ్యంగా పుష్టికరంగా నుండజాలదు.

దారిద్ర్య నిర్మూలనంలో ముఖ్యంగా మధ్యతరగతి మహిళాలోకం చైతన్యవంతులు కావలసియున్నది. ఒక కుటుంబంలో ఒకరు, యిద్దరు పురుషులు సంపాదించడం, పదిమంది కూర్చొని తినడమనునది పోవాలి. కుటుంబంలోని ప్రతివారు కుటుంబ ఆదాయం పెరుగుదలకు తోడ్పడుతూ, దాంతో నిత్యావసరములను సేకరించుకొని ఆర్థిక దుస్థితినుండి విముక్తులు కావాలి.

ప్రభుత్వము నిర్వహిస్తున్న మహిళాసంక్షేమ కార్యక్రమము సౌభాగ్యవంతమయిన సంఘ నిర్మాణము నుద్దేశించి జాతీయ శ్రేయస్సును రూపొందించవలసియున్నది.

## అభినందనలు :

ఈ సంవత్సరము ఉత్తమ విద్వాంసులుగా శ్రీమతి యం. యస్. సుబ్బులక్ష్మి, పాలఘాటు మణి అయ్యర్‌లను కేంద్ర ప్రభుత్వము సన్మానించిన సందర్భమున అభినందనీయులు.

సంగీత సాహిత్యాలు దైవీకంగా అబ్బేవైనా సాధన వానిని మెరుగులు దిద్దుతుంది. సంగీతము భక్తిని, ముక్తిని ప్రసారిస్తూ మానవునిలో ఆనందాన్ని పూరిస్తుంది. అట్టి సంగీత కళను ప్రతి మానవుడు సాధకుడుగానో లేక పిపాసిగానో ఆరాధించవలసియున్నది. సంగీతమును విని ఆనందించలేనివారు, తనలో సంగీతము లేనివాడు మానవుడనిపించుకోడని ప్రతీతి. సంగీత సాహిత్యాలవ్యాప్తిపట్ల కేంద్ర ప్రభుత్వము చూపుచున్న ఆసక్తి ప్రశంసాపాత్రము.



# శ్రీ దుర్ముఖినామ సం॥ ర చైత్ర, వైశాఖమాసములు

| | | | |
|---|---|---|---|
| 1956 సం॥ ఏప్రిల్ నెల | 16 | సో | ష 40.0 మృ 3-26 ఆర్ద్రా 55.36 త్యా 3-42 |
| | 17 | మం | స 33.30 పున 54.22 త్యా 3.42 |
| | 18 | బు | అ 27.3 పు 49.52 త్యా 3.42 అశోకాష్టమి |
| | 19 | గు | న 20.53 ఆశ్రే 45.48 తిథిద్వయం. శ్రీరామనవమి |
| | 20 | శు | ద 15.17 మఖ 42.25 త్యా 3.47 ధర్మరాజుదశమి |
| | 21 | శ | ఏ 10.26 పూఫ 39.55 త్యా 3.50 రా 26 23 త్యా 3.55 |
| | 22 | ఆ | ద్వా 6.32 ఉఫ 38.27 త్యా 3.59 |
| | 23 | సో | త్ర 3 46 హ 38.9 త్యా 4.4 |
| | 24 | మం | చతు 2.13 చి 39.6 త్యా 4.9 |
| | 25 | బు | ○ పౌ 1.58 స్వా 41.17 త్యా 4.13 |
| | 26 | గు | కృపా 2-51 విశా 44.31 త్యా 4.17 |
| | 27 | శు | విది 4.54 అనూ 48-47 త్యాజ్యాభావః తిరువళిక్కేణి పార్థసారథిస్వామి గరుడోత్సవం |
| | 28 | శ | త 7.55 జ్యే 53.51 త్యా 4.20 |
| | 29 | ఆ | చ 11.42 మూల 59.32 త్యా 4.23 |
| | 30 | సో | పం 16.0 పూషా 60.10 త్యా 4.25 మత్స్యజయంతి |
| 1956 సం॥ మే నెల | 1 | మం | ష 20.34 పూషా 5-36 త్యా 4.25 శూన్యతిథి, తిరువళిక్కేణి పార్థసారథిస్వామి రథోత్సవం |
| | 2 | బు | స 25.6 ఉషా 11.37 త్యా 4-23 |
| | 3 | గు | అ 29.19 శ్ర 17.23 త్యా 4.21 |
| | 4 | శు | న 33-1 ధ 22.41 త్యా 4.18 |
| | 5 | శ | ద 35.53 శత 27.13 త్యా 4.15 |
| | 6 | ఆ | ఏ 37.45 పూభా 30.50 త్యా 4.10 |
| | 7 | సో | ద్వా 38-28 ఉభా 33.20 త్యాజ్యాభావః |
| | 8 | మం | త్ర 37.56 రే 34-38 త్యా 4.5 వరాహ జయంతి |
| | 9 | బు | చతు 36-9 అశ్వ 34 42 త్యా 4.1 రా 26.42 త్యా 3.56 మాసశివరాత్రి |
| | 10 | గు | ● అమా 33.9 భ 33.35 పిండపితృయజ్ఞః |
| | | | **వైశాఖమాసము** |
| | 11 | శు | శుపా 29-3 కృ 31.21 వైశాఖస్నానం ప్రారంభం |
| | 12 | శ | వి 24-0 రో 28-11 పరశురామజయంతి |
| | 13 | ఆ | త 18.13 మృ 24-18 పుష్పగిరి చెన్నకేశవ గరుడోత్సవం |
| | 14 | సో | చ 11.57 ఆర్ద్రా 19-56 జగద్గురు శంకరజయంతి |
| | 15 | మం | పం 5.25 ఏవ్యం 53-22 పున 15-24 |

Printed & Published by Dr. S. Seshagiri Rao, at Lodhra Press, Kesari Kuteeram Ltd.
15, Westcott Road, Royapettah, Madras.
Ag. Editor : C. C. Punniah.



నాగార్జునకొండ - చైత్య గృహము స్తూపము

By Sri. M. G. Menon





నాగార్జున కొండ శిలాఫలకముపై బుద్ధుని చిత్రము

By Sri. C. Bharata Sastry







నాగార్జున కొండ - పురావస్తు శిల్పశాల

By Sri. C. Bharata Sastry

# భారత ప్రశస్తి

# THE PRIDE of INDIA




# LODHRA

FOR LADIES' HEALTH

KESARI KUTEERAM LTD., MADRAS

EASTERNS 394

# లోధ్ర

స్త్రీల ఆరోగ్య భాగ్యానికి

Lodhra Press, Madras-14.